# సావిత్రి పరిణయం - యక్షగానము.



ఇది.

## వెస్టు వార్డు అండు కంపెనీవారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడెను.

చెన్నపట్టణము.

1933

శ్రీరస్తు.

# సావిత్రీపరిణయము - యక్షగానము.

## ఇష్టదేవతా ప్రార్థన.

ఉ. శ్రీరమణీశలేఖ గణసేవితపాదదిగంతకీర్తి వి,స్తారకబంధజాతి ఘన
తాపసవందిత నారసింహ వృ,త్రారిక పాళిహంత సిరిరాజిత చక్కపురీ
వరంబునన్, వారధిరాడ్డిసుస్థిరనివాస ననుంగరుణించు మ్రొక్కెదన్.

చ. సురపతివహ్నికాల సురసూదనవారిధిరాట్సమీరకి
న్నరపతి భూతనాథులును నమ్మి ముదంబున గొల్చినట్టి మీ
చరణపయోజము ల్మనుజసింహ మదిందయ జేసి నేలుమీ
ధరధరధీర చక్కపురిధాముడ నిన్ను దలంచి మ్రొక్కెదన్.

## సుదర్శనస్తుతి.

చ. ఘనదురితారిజాల మదఖండనభంజ మయూఖరాజిచే
ననయము సంతసంబొదవ మండితచర్మసుభాషణాలిచే
ననుదినము ప్రసూహృదయ వారికి దక్షిణహస్తమందునన్
దనరిన చక్రరాజు మది దల్చెద భక్తి నహర్నిశంబులన్.

దేశికస్తుతి. ఉ. శ్రీపరవస్తువంశనిధి శీతకరుండగు శూరనాథునిన్, తాప
సరాత్కృపన్ ధరను ధన్యతనొందియు జేతనాళికిన్, నాపదలెల్ల బాపు
చురహస్యముల న్కృపజేసి యేలు యా, దీపిత జియ్య నామ్యుడగు దేశి
కుపాదములన్ స్మరించెదన్.

లక్ష్మిస్తుతి. చ. కరయుగళంబున న్నరయు కంజముల న్నవపల్లవాంఘ్రిపై,
బరువడి నృత్యము ల్సలుపు బంగరుపేరుల తేజరిల్లుచున్, గుబ్బచ
యుగ్మభారమున గుందినమధ్యము గల్గు లక్ష్మి ని,న్నిరుపమభక్తితోడ
మది నెంచి దలంచి స్తుతించి మ్రొక్కెదన్.

## సరస్వతీ స్తుతి.

ఉ. మంగళచర్యదాయి శుభమానితకీర్తి తటిల్లతాంగి సా,రంగ విశాల
నేత్రి ఘనరంజితవీణాధరాకరాబ్జసా, రంగసుయాన రత్నమణి రాజిత
భూషణ భూషితాంగినన్, పొంగి సుశబ్దవాక్పటిమ బ్రోవు నుతించెద
నమ్మ భారతీ.

## సకలదేవతాస్తుతి.

చ. వలువను చండికేశ్వరుని నారదు డాదిజమానులన్ ధరా,వలయము
నందునుండుకవివర్యులపూషణనోషధీశుని, న్వెలుపముతోడ దిక్పతుల

యొనమ్మ! యిక మేము బోయ్యేము యింద్రునిసభలోకి గనుక యింకొక వార్త గలదు సుమ్మి! మాళవి యేతెంచి మదివిలసిల్లుచు విరిబోణిపోయివచ్చేము - మాయందు నీవుకరుణచాలగ వుంచుము నిరతంబుసఖులతోడ సురభోజమందునుండి-స్థిరమందుచాలగా ప్రసిద్ధికెక్కితిమె - వోవిరిబోణి పోయివచ్చేము.

చ. శ్రీనరసింహదాసుని విశేషకృపారస ముప్పతిల్లు స
న్నానము జేసి కీర్తు లనుమానము లేక నొసంగు చుండియుఁ
మానుగ సత్యధర్మ మనుమార్గము సంపదలిష్టకోర్కెలుఁ
మానక వచ్చినట్టివరమానరసింహుని కేను మ్రొక్కెదఁ.

మాళవి రాకడ దర్వు - అటతాళము.

శ్రీనరహరినిన్ను సేవించిమ్రొక్కెద - నారసింహా! అనుమానము లేకమన్నించిబ్రోవుమి-నార! కరిగాచిమకరిని శిరము ద్రుంచిన దేవ-నార! ధరలోననీనిజదాసదాసిని యేను- నార! నన్ను కరుణించిబ్రోవవే కారుణ్యసాగర- నార! పుడమిలో శ్రీచుక్కాపురమందు నెలకొన్న-నార! గడియుతడవుసేయకు నీదు దయకు పాత్రనుసుమ్మి-నారసింహా!

చె-క. దొరసాని నీవుయెవ్వరో, పురమెయ్యదో నామమేదో పురుషుండెవడో, సిరివిలసిల్లగవస్తివి, సరగున తెరవెళ్లినీదుసరణియుజెపుమా-

మాళవి-వ. ఓచెలీ నాయొక్క వృత్తాంతము సకలవిద్వజ్జనులతో గూడుకొన్న సభ వినేటట్టుగ వెళ్ళి చెప్పగలనే మాయమ్మా.

మాళవి తెరవెళ్లేదరువు - ఆదితాళము.



తివి। బా। చారుబంగారు మొగ్గలపేరు చనువగలపైని జారివిలసిల్లు కాంతులుమీరు - గారవముతో శృంగారవతులు బలోత్కారికతో ననుగొలిచి యుందురు। బా। అంచయానరో వినవోయమ్మ - లాలితమయిన పంచబాణాని చిలుకానమ్మా - అంచితమగు మణులాభరణమ్ములు మించి ప్రకాశించు మెలతనే వోచెలి। బా। భాసురాంగిరో వినవమ్మ కోమల చంపక నాసాసావిత్రికూతురమ్మ - వాసిగ చుక్కాపురీశునినమ్మియు భూసురోత్తముల పూజలుచేసెద। బాలా।

చెలి-గీ. తరుణి నీయొక్క రూపసౌందర్యములును, జెప్పితే కాని మరియేమి చెప్పలేదు, సరగునను నీదుపురిపేరు వరునిపేరు, తల్లిదండ్రుల నామంబు లెల్ల జెపుమా.

మాళవి-ద్వి. చెప్పెదవినవమ్మచంచలనేత్రి, తప్పకతలి దండ్రి తాతలపేరు నాతల్లిదయశాలి నవమోహనాంగి, నాతండ్రి ధర్మాత్ము డతిశూరుడమ్మ మద్రదేశముమాదిమగువరో వినవె, భద్రాంగుడగునాదు పతియొక్క పేరు యేనెట్లు జెప్పుదు యెలనాగనయ్యొ, మానవతీనాదు మదికిసిగ్గవును ఘనయశుడగుభూకాంతుడోయమ్మ, అనువుగా సత్యపతిఅనియందురిలను కోమలివినవెనాకూతురుయొక్క, నామంబుసావిత్రి నలినాయతాక్షి యారీతి నావార్త లెల్ల జెప్పితిని, నారీమణిరో నేడు నామీదచాల దయియుంచి నేనొక్క చిత్రంబు గంటి, అరమరలేక నీవంత వినవమ్మ చుక్కాపురీశుని సుదతిమణియొక్క, చక్కనకళచేత బిరుదుగలిగుండు.

చెలి-వ. ఓయమ్మా సకలజనసమ్మతంబుగా అటువంటి చిత్రముయొక్క మహాత్మ్య మెట్టిదో చెప్పవే దొరసాని.

మాళవి దరువు - అటతాళము.

శ్రీమించు చుక్కాపురము నెల్లకాలము - సన్నుతాంగి యభిరాముడా శ్రీలక్ష్మిరాయుడు పాలించు-సన్ను। పసనైనదాళింబ పనసమామిడినిమ్మ - సన్ను। అరటి పసుపుతోటలచేత బరగు చుక్కాపురి- సన్ను। శుకరాజరాయంచ బకమయూరంబులు-సన్ను। పాలకీరథములచే పెంపెసగు చుక్కాపురి - స। కరిజంబుసూకర ఖడ్గచమరీ తేమో-సన్ను। సరహరి భల్లూకములతో నలరు చుక్కాపురి-సన్ను। ఈబ్రహ్మాండములో చాల ప్రబలుచుక్కాపురి-సన్ను। మకరాంకుశరహిత మనసూలు గలిగియు-సన్ను। చాల శుకవాణులతో నుండు సొగను చుక్కాపురి- సన్ను।

రొనమ్మా! యిక మేము బోయ్యేము యింద్రునిసభలోకి గనుక యింకొక వార్త గలదు సుమ్మి! మాళవి యే తెంచి మదివిలసిల్లుచు విరిబోణిపోయివచ్చేము - మాయందు నీవుకరుణచాలగ వుంచుము నిరతంబుసఖులతోడ మరణోజమందునుండి-స్థిరమందుచాలగా ప్రసిద్ధికెక్కితిమె - వోవిరిబోణీ పోయివచ్చేము.

చ. శ్రీనరసింహదాసుని విశేషకృపారస ముప్పతిల్లు స
న్మానము జేసి కీర్తు లనుమానము లేక నొసంగు చుండియు౯
మానుగ సత్యధర్మ మను మార్గము సంపదలిష్టకోర్కెలు౯
మానక వచ్చినట్టివరమానరసింహుని కేను మ్రొక్కెద౯.

మాళవి రాకడ దరువు - అటతాళము.

శ్రీనరహరినిన్ను సేవించిమ్రొక్కెద - నారసింహా! అనుమానము లేకమన్నించిబ్రోవుము-నార! కరిగాచిమకరిని శిరము ద్రుంచిన దేవ-నార! ధరలోననీనిజదాసదాసిని యేను- నార! నన్ను కరుణించిబ్రోవవే కారుణ్యసాగర- నార! పుడమిలో శ్రీచక్కా పురమందు నెలకొన్న-నార! గడియాతడవు సేయకు నీదు దయకు పాత్రనుసుమ్మి-నారసింహా!

చె.క. దొరసాని నీవుయెవ్వరో,పురమెయ్యదో నామమేదో పురుషుండెవరో, సిరివిలసిల్లగవస్తివి, సరగున తెరవెళ్లినీదుసరణియు జెపుమా.

మాళవి.వ. ఓచెలీ నాయొక్క వృత్తాంతము సకలవిద్యాజ్ఞనులతో గూడుకొన్న సభ వినేటట్టుగ వెళ్ళి చెప్పగల నే మాయమ్మా.

మాళవి తెరవెళ్లేదరువు - ఆదితాళము.



బాలామణిరో చినమ్మా నాపేరు ముద్దుల మాళావియందురె లోకాన్నమ్మా! మేలుగాను శ్రీలుబడచె ముత్యాలకొంగు జీరాడవేంచేసి

తివి। బా। చారుబంగారు మొగ్గలపేరు చనువగలపైని జారివిలసిల్లు కాంతులుమీరు - గారవముతో శృంగారవతులు బల్కొరికతో నను గొలిచి యుందురు। బా। అంచయానరో వినవోయమ్మ - లాలితమయిన పంచ బాణాని చిలుకానమ్మా - అంచితమగు మణులాభరణమ్ములు మించి ప్రకాశించు మెలతనే వోచెలి। బా। భాసురాంగిరో వినవమ్మ కోమల చంపక నాసాసావిత్రికూతురమ్మ - వాసిగ చుక్కాపురీశునివమ్మియు భూసురోత్తముల పూజలుచేసెద। బాలా।

చెలి-గీ. తరుణి నీయొక్క రూపసౌందర్యములును, జెప్పితే కాని మరియేమి చెప్పలేదు, సరగునను నీదుపురి పేరు వరుని పేరు, తల్లిదండ్రుల నామంబు లెల్ల జెపుమా.

మాళవి-ద్వి. చెప్పెదవినవమ్మచంచలనేత్రి, తప్పకతలి దండ్రిదాతలపేరు
నాతల్లిదయశాలి నవమోహనాంగి, నాతండ్రి ధర్మాత్ము డతిసూరుడమ్మ
మద్రదేశముమాదిమగువరో వినవె, భద్రాంగుడగునాదు పతియొక్క పేరు
యేనెట్లు జెప్పుదు యెలనాగనయ్యొ, మానవతీనాదు మదికిసిగ్గవును
ఘనయశుడగుభూకాంతుడోయమ్మ, అనువుగా నశ్వపతిఅనియందురిలను
కోమలివినవె నాకూతురుయొక్క, నామంబుసావిత్రి నలినాయతాక్షి
యీరీతి నావార్త లెల్ల జెప్పితిని, నారీమణిరో నేడు నామీదచాల
చరియించె నేనొక్కచిత్రంబు గంటి, అరమరలేక నీవంత వినవమ్మ
చుక్కాపురీశుని సుదతిమణియొక్క, చక్కనకళ చేత బిరుదుగలిగుండు.

చెలి-వ. ఓయమ్మా సకలజనసమ్మతంబుగా అటువంటి చిత్రము యొక్క మహాత్తు యెట్లాటిదో చెప్పవే దొరసాని.

మాళవి దరువు - అటతాళము.

శ్రీమించు చుక్కాపురము నెల్లకాలము - సన్నుతాంగి యభిరాముడౌ శ్రీలక్ష్మిరాయుడు పాలించు-సన్ను। సన్నైనదాళించ వనసమా మిడినిమ్మ - సన్ను। అరటి పనుపుతోటలచేత బరగు చుక్కాపురి- సన్ను। శుకరాజరాయంచ బకమయూరంబులు-సన్ను। పాలకీరథములచే పెంపెసగు చుక్కాపురి - స। కరిజంబుసూకర ఖడ్గచమరీ లేమో-సన్ను। సరమారి భల్లూకములతో నలరు చుక్కాపురి-సన్ను। ఈబ్రహ్మాండములో చాల ప్రబలుచుక్కాపురి-సన్ను। మకరాంకుశరహిత మనసూలు గలిగియు-సన్ను। చాల శుకవాణులతో సుందు సొగసు చుక్కాపురి- సన్ను।

ధరణిపై యిటువంటి వరపురంబు లేదు- సన్ను! లక్ష్మీవరుడౌ నరకేసరి చుక్కాపురి-సన్ను!

చె-వ. ఓయమ్మా అటువంటి చుక్కాపురమును రక్షించినవాడు యెటువంటివాడు చెప్పవే మాతా.

మాళవి-సీ. మూడుకన్నులవాడు బూడిద జేసినవానితనూజునివనిత తండ్రి కరములుద్రుంచగ నీమరదితండనిదాటు వానిశిరమునదుండు వానియన్న, తండ్రినిదిన్నట్టి ధన్యులరిపుతల్లి కొడుకుచు సారథి కొనినవాని, కొడుకుతల్లి బావకొడుకుగురునకు బాణపంక్తులిచ్చినవాని ప్రజ్ఞహారుని, సతినిగొనిపోయినవాని సుతునిరిపుని, వైరిశాతను గన్నట్టి వానిబట్టి, శేరినటువంటివాడు మది కోరిచాల, పోషకర్తను జేసు యీపురము నెపుడు.

చె-వ. ఓగజగామిని యీరీతిజెప్పితె తెలియనేరను గాన మనోక్షిష్టముగా తెలియజెప్పుమా తల్లీ:

మాళవి-వ. సదాశివుని చేత భస్మమైనవాడు మన్మథుడు, మన్మథునికుమారుడు అనిరుద్ధుడు, అనిరుద్ధునిభార్య వుషాసుందరి, వుషాసుందరి తండ్రి బాణాసురుడు, బాణాసురుని హస్తములు ద్రుంచినవాడు కృష్ణమూర్తి, ఇతనిమరది చంద్రుడు, చంద్రునితండ్రి సముద్రుడు, సముద్రమును దాటినవాడు హనుమంతుడు, హనుమంతునిధ్వజమం దుంచినవా డర్జునుండు, అర్జునుని అన్న భీముడు, భీమునితండ్రి వాయుదేవుడు, వాయువును తిన్నటువంటివి సర్పాలు, సర్పాలకుశత్రుడు గరుత్మంతుడు, గరుత్మంతునితల్లి వినత, వినతకొడుకు అనూరుడు, అనూరుని సారథిగా కొన్నవాడు సూర్యుడు, సూర్యునికొడుకు కర్ణుడు, కర్ణుని తల్లి కుంతి, కుంతిబావ ధృతరాష్ట్రుడు, ధృతరాష్ట్రునికొడుకు దుర్యోధనుడు, దుర్యోధనునిగురువు ద్రోణాచార్యులు, ద్రోణాచార్యులకు బాణబాణాసనములిచ్చినవాడు పరశురాముడు, పరశురాముని గర్వమణచినవాడు శ్రీరాములు, శ్రీరాముల భార్య సీతాదేవి, సీతాదేవిని గొనిపోయిన వాడు రావణాసురుడు, రావణాసురుని కొడుకు యింద్రజిత్తు, ఇంద్రజిత్తువైరి యింద్రుడు, యింద్రునివైరి బలిచక్రవర్తి, బలిచక్రవర్తితాత ప్రహ్లాదుడు, ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడు, హిరణ్యకశిపుని జీరినవాడు నృసింహమూర్తి, అటువంటి నృసింహమూర్తి యెల్లప్పుడు చుక్కాపురమును రక్షించునే కొమ్మా.

చె-స. ఈరీతి చెప్పితివి సంతోషమాయె గాని తరువాత జెప్పవే దొరసానీ.

మాళవి దర్వు-జుల్వతాళము.

భామరో నామనవిని గానవటె నావార్తనీకు ప్రేమతో వినుపింతు వినవటె. కోమలి సావిత్రినాదుకూతురు సురసిద్ధసాధ్యభామలాను నపహసించు నామరూప యౌవనముతో॥ భామ॥ ధారుణీపు దశ్వపతియును మణిఖచితమైన చారుభూషణములు మెరయుచు - శూరుడు జయబాహుబలుడు సుందరుండు మంత్రివరుడు-ధీరులుబల దండవంతులు తేజములతో మెలగుచుందురు॥ భామ॥ దానజనులు నన్నుగొలుతురు కస్తూరి మేనబూసి మనసుప్పొంగియుందురు-వాసిగ శ్రీచక్కాపురి నివాసుడై లక్ష్మీనరకేసరిని నమ్మిచాల కీర్తికెక్కిన భామరాంగిని॥ భామరో॥

సుందరుడను ప్రధాని రాక.



చ. చిరయశుడన్ సుమంత్రికులశేఖరుడన్ కులపర్వతంబులన్
ధర బడదన్నెదన్ నసురదండితశౌర్యభుజండ నిద్ధరన్
స్థిరముగ నేలు యశ్వపతి ధీసుతకున్ కృపచేత నెప్పుడున్
వరములొసంగు చక్కపురి వాసుని నమ్మిన సుందరుండరా.

దర్వు - అటతాళం.

సుందరాంగుడనేవాడను రణశూరుడాను పండితవాడను- అందముతోడను నమ్ములుధనువ్వూన పొందించి వైరులద్రుంచేటి॥ సుంద॥ సకలచిత్రంబులతోడను నేసమరంబు జేసేటివాడను - సుకుమారమైనయీసుందరదేహంబు ప్రకటితంబుగ కోటిభాను తేజంబునించు॥ సుం॥ ధారుణిపాక

ధాత్రీశ్వరుండెట్టి ధర్మాత్ముడోరి- పెద్దలపోడచూచి పిలిపించెవారి- వద్దికి చేరి బహువందనములిచ్చు - కవులచేవచ్చిన కార్యంబులెల్ల- వివరించివిని చాల వినయంబులిచ్చు- భూసురకోటులపూజించివారి - యాశీర్వాదంబు లానందమునువడసి - అబ్బబ్బయనవచ్చు నైశ్వర్యమందు - గొబ్బునను మార్తాండకులవంశజుండు- అధికమానతడు నీ యవనీశులకు- విధియట్లు నిర్మించె పదిలముగనితను-నంత చెప్పిన వాడ నివ్వాడు నీకు- యింతశృంగా రంబు యెక్కడజూడ-అటువంటి సంపదగల రాజసంబు-తటుకున వర్ణించ ధాత తరమౌనె.

గీ. భళిరభళిర యిట్టి వసుమతీపతియునాకు, సన్నుతనిపించె యితనితోసాటి ధరలో, వెతకినను లేదు ముందా నేవినగలేదు, సకలధర్మాదుల ను తాను సాహసుండు.

మనుజ-వ. వినవయ్యా ఇదిచాలు తర్వాత నుచ్చటజెప్పవో యయ్యా.

ప్రధాని దరువు - ఆదితాళం.

అదిగో వచ్చెను రాజువేగ - భేరీలమ్రోత నదుగో వచ్చెను- వినుభాగ ముదమున సుదతులు మురిమురినవ్వుతో వదలక నాట్యము వరుసతోసల్పగ॥ అది॥ పంచరంగుల తేరు నెక్కి నవమోహమై పంచ బాణుని తేజముదక్కి- మించి మించి పసిడంచుశాలువ దులకించగాను సవరించుచువేగ॥ అది॥ ఘల్లు ఘల్లుమని గెజ్జలు మ్రోయ యిరుప్రక్క లందు పల్లవించుచు చౌరీలుమెరయ-మల్లెమొల్లాలును జల్లుచు భామిను లెల్లనుగూడి విలసిల్లగొల్వగ॥ అ॥ ఆణిముత్యంబులహారములును కేయూ రంబులును రాణించుచుండు - పతకంబులును వీణపాణు లలివేణులు చాలగ జాణతనంబున సరిగమబాడగ॥ అ॥ వరచుక్కపురినివాసునిదలచి మదిలోనబూని-ధరలోన జనులందరిని బ్రోచి భూరిధీరు డలరారి సంపద లీప్సిరి పుత్రులకై గోరుచువేగ॥ అది॥

అశ్వపతిరాజు రాకడ.

క. శ్రీరమణీమణిలోలుని, నారదసనకాదిమౌని సత్సుని జనసం, చారుని మురసంహారుని, ధారుణిశ్రీచుక్కాపురి ధాముని దలతుగ్.

దరువు - ఆదితాళము.

వరయశ్వపతివచ్చెను దశదిక్కులు వర్ధిల్ల పెంపొందెను - ధర ణిలో జనులను ధర్మముతో హితపరిపాలనజేసి ప్రస్తుతి జేకొని॥ వర॥ కనకాంబరంబులును దేహంబునందు కదలి విలసిల్లగాను - ఘనమైనరథ ములు గజతురగంబులు వినయంబుతో మత వెంటనడువగా॥ వ॥ దండ

నాథులుగొల్వగా కాహళభేరీతప్పెటలు మ్రోయగా - మెండునిశానీలు మేలైనబరిసెలు నిండినసేనలఝుండలెగయుగను॥ వర॥ శ్వేతఛత్రంబులును తోరణములు ఖ్యాతిగ మెరయంగను - నారీమణులుగూడి నాట్యము సలిపియు దాతవీవనిమముదయసేయుమనగాను॥ వర॥ యిలచుక్కాపురి వాసుని సన్నుతమూన తలచి చిత్తమునబూని- తెలివైన మకుటాము దీప్తులువెలుగగ వరుదుగ తేరెక్కి నవమోహనాంగుండు॥ వరయశ్వపతి వచ్చె॥

అశ్వపతిరాజు రాకడ.



ప్రధాని-క॥ ఓరాజరత్నమానీ!రాజసమివుడు జూపి నేరుపుతోడన్। గోరాజవై భవుడవై । రారాజులుజూచి పొగడ రచ్చకురమ్మా॥

రాజు-మ. వినుమీమంత్రికులాబ్ధిచంద్రసభలోవిస్తార కీర్తిన్నహా। జనముల్గొల్వగ తేజరిల్లసిరులం జెన్నొందనావార్తనీ । కనుకూలంబుగ విన్నవింతు మరిమాయావాదులంద్రుంచిమే। దినిపాలించియుభూరిశౌర్యముతో సాధింతు ధరానాథులన్.

తెరవెళ్లేదరువు - ఆదితాళము.

రాజా అశ్వపతిరాజా రాజమహారాజ కంఠీరవ భూజననుతుడను పుణ్యాసంచాపడ॥ రాజా॥ శూరా కనకాద్రిసమధీర - చారుముత్యములహారములాదిగ కోరుచుభూషణ కోటిధరించిన॥ రా॥ జాణా - సుజన సంత్రాణ- బాణాసన బహుభుజంబులు రాణించగను జనరక్షణ చేసెద॥ రాజా॥ లోలా-ఆశ్రితజనపాల - మేలుమేలుమనజాన కిరీటము చాలగమెరసెను నాసాటివారెవ్వరు॥ రాజా॥ ఈశా-దుర్జనవినాశ-వాసిగచుక్కాపురివాసునినమ్మియు- భాసురముగభూమిపాలన జేసెద॥ రా॥

ప్రధాని-శా॥ రాజేంద్రాంచితభూప నీదుమహిమర్గా రాజ్యంబు నీ నామమర్గా । నీజన్మంబునుకీర్తిప్రజ్ఞ సిరియుర్గా నీతల్లిదండ్రాదులర్గా। రాజిల్లంగను జెప్పి భూమిజనులర్గా రక్షించు నేనిప్పుడుర్గా।పూజల్ నేసెదచిత్తగించివినుడీ పూర్ణాబ్జ పత్రాననా॥

రాజు-మ॥ వరమద్రేశుడ భూరిబాహుబలుడ న్వారాశిగంభీరుడర్గా। నరనాథాధిపుడర్గా సుకీర్తిపరుడర్గా నారాయణస్వామినే । చిరకాలంబుల యందుపుత్రులకునై చిత్తంబులో గొల్చియుర్గా । ధరణీపాలనజేసి సంతసిలి సంతానంబు నేగోరితిర్గా॥

దరువు - అటతాళము.

వరయశ్వపతిని రా వరుసతో వినరోరి ద్వారపాల - నేనీ - ధరయెల్లపాలించి దనరినుతించితి॥ ద్వార॥ భార్యమాళవి నాకు వతిభక్తిగల దుర॥ద్వా॥ యెప్పుడార్యులపదముల అతిభక్తిపూజింతు॥ ద్వా॥ శరణు శరణ్యుడరా జగదేకశూరుడ॥ ద్వా॥ దేవునికరుణించుమనుచు నుఘనముగ వేడితి॥ ద్వా॥ మద్రదేశంబును మహాకాంతిగలదుర॥ ద్వా॥ పెక్కు భద్రంబుచేకొనిపాలించెదనుర॥ ద్వా॥ ధరణిచుక్కాపురిధామునికరుణతో॥ ద్వార॥ చిన్నరుచితగాగల్గెర జెప్పనేలను నీకు॥ ద్వార॥

ప్ర-గీ॥ ఇట్లుజెప్పితె యీజనులకెట్లు తెలును। తేట తెల్వగబల్కుడితీప్ర పడక। సత్యవంతుడవనిచాలసన్నుతించి।అడిగితిననీదువార్తనాకానతివుడి॥

రా-ద్వి॥ అనువొందగానన్నునడిగితివినీవు-కనుకనునాపూర్వ కథ వినిపింతు - భద్రంబుతో నాదు పలుకులువినుమా - మద్రదేశముమాది మహాకాంతినుండు- అశ్వపతినాపేరు నవనిపైచాల - శాశ్వతంబుగ కీర్తి నవరించినాను - బలము చాతుర్యంబు పరమకళయందు - తలపగ లేనట్టి ధర్మంబునందు- ధీరతయందును కీర్తిశూరత్వమందు - రారాజులిలలోన రారుమాసాటి-వితరణయందు సద్వినయుండనోరి- మతితప్పు లేకను మరి యొక్కమాట-పతికాదుమాళవి సహితుండనయ్య - సుతులు లేరనిచాల శోకింపుచుండి-యతివలె పద్దెనిమిదేండ్లు ధరయందు- అతిభక్తితో తప మాచరించుచును-అనిశంబు లేక నేనాశక్తితోను-విశదంబుగాను సావిత్రి గొల్చితని - యాదేవి ప్రత్యక్షమయ్యె నాకనియె-ఆదరించితి నీవు వర మడుగుమనగా-తడవు సేయక సుతుల దయచేయుమనిన - కొడుకుగాదని చిన్ని కూతుర నిచ్చె॥

ప్రధానిఁన. ఓ మహారాజ రాజవంశోద్భవా మీరు కుమాళ్ళ గూర్చి సావిత్రియనేదేవిని పదునెనిమిదేండ్లు తపస్సుచేసి కొనియాడితే ఆదేవి ప్రత్యక్షమై కుమారుని యివ్వక కుమార్తెను యిచ్చుట కేమికారణమో చెప్పు మీరాజా.

రాజు సీసార్థములు.

సుందరాంగుడ నన్ను సొంపుతో నడిగితి వేమనిచెప్పుదు యిట్టిమాట-నానోముఫలమే మొ నా కేమిదోచదు నిప్పుడా ముచ్చట కేమి సేతు-వినరోరిచెప్పెద మనసుంచియీమాట నొకనాడు నామనసుకూహదోచె-అదియెట్టిదనగను యువనిలోనరులకు॥ధనముండి యేమి సేయనుతలితండ్రి బాంధవజనముండి యేమిసేయను ఘనమైన రాజ్యసంపద గలిగినగాని యేమితనకుగతియైన చిన్నితనయులు లేనిదెంత-ధన॥ సుతులు లేనిదితనకు గతిలేదయనిచాల తొందరగలిగినే తూర్ణముగను - సావిత్రిని వేడి సన్నుతించి తెవచ్చి తనయుడుగాడని తనయనిచ్చె - సుతునికృపసేయుమనిసొగసుతో వేడితే నాదైవతంబు నాకనియెనిట్లు - గుణవంతుడా మళ్ళికోరెద వెందుకుతొలుతానె విధికితెల్పితి నీముచ్చటంత తెల్పి సంతానమడిగితి - జలజాసనుడునాకుజెప్పె కన్యకాని పలుమారుఅడిగినాను పలికెనిశ్చయముగాను - తొలుతానె॥ తరువాత నూర్గురు తనయులుగల్గెరు యిప్పుడే కన్యను యివ్వమనియె-కనుక నేనీకు యీకన్యకనిచ్చితి సావిత్రియనేపేరు చాటుమనుచు - యీవిధంబున జెప్పియెంతయు నిల్వక గుప్తమైపాయ నాకు జలజాక్షి యిఁకయేమిసేతుననియు నందునిల్వక - చింతిల్లిగృహాము చేరితి॥ నాప్రాణనాయకి చెంతజేరి తెల్పితి - మంతనంబునపత్ని మరిమరి చింతచేసి కొంతకాలముగడిపి కోరుచునుండె మదిలో - చింతిల్లి గృహాము చేరితి॥ మరికొన్నిదినములు మది గోరుచుండంగ జనన మొందెను సాధుజనులు పొగడ-సావిత్రిదేవి ప్రసాదంబుగనుక సావిత్రియని పేరు చాటినాము - మరసిద్ధసాధ్యాది సుదతులకన్నను చక్కదనమాను ఈసన్నుతాంగి - యిటువంటితనయకు యింపైనపురుషుడు దొరకితెచాల మరతును నేనెక్కడాని సరగునవెతకి చూతును-ధరణిచుక్కాపురి ధాముని కరుణచేత నిరుపమతేజుడై వరుడు నాతనయకిపుడు-దొరకితే॥

ప్ర-గీ॥ రాజరవితేజ మహారాజ రాజనీదు । ముచ్చటలు విన్నమొదలుగామోదమాయె । గానియిపుడేమి పనిసేయబూనినారొ । తెలియజెప్పవె రణరంగధీర నాతో॥

## రాజునకు మంత్రికి సంవాదము - ఆదితాళము.



రాజు॥ మంత్రివర్య వినుమా - మమ్మేల మానసమున గనుమా - మంత్రినయ్య బహుమంత్రము నామర్మమడుగ దగున॥

మం॥ రాజరాజ గనుమా - కోపము రానియ్యక వినుమా - తేజవంతుడవు కోరినముచ్చట తెలియచెప్పవలెను॥

రాజు॥ చిన్నకూతురకును - వరుడు వున్నాడొక్కడాను - దిన్నగభటులను దేశములోపల త్రిప్పదోలవలెను॥

మం॥ అట్లుగాదు వినుమా - కూతురు నడుగవలయు పిలువుమా - యెట్లున్నదో ఆమెచిత్తము యెరిగి సేయవలెను॥

రాజు॥ నవమోహనమైన కూతురి నడిగి సేయదగునా - అవుననగను బలుదేశము వెదకి నేనల్లుని దెచ్చెదను॥

మం॥ పొలతిసమ్మతిగను లగ్నము పూనిసేయవలెను - సలలితముగ స్త్రీసమ్మతి జగములో చాలగలదు వినుమా॥

రాజు॥ మొదలుబ్రాహ్మణులను పిలిచి ముజ్జగమందునను - పదపడి వెతుకదోలినాక శశివదన నడుగవలెను॥

మం॥ ఆలాగైతేనుమంచిది అవనిదేవతలాను - బాలామణికి తగినచక్కని పతినిచూడ బంపు॥

రాజు॥ వరచుక్కాపురి నివాసుని వదలక మదిబూని - మరువక బుద్ధిమంతుల బ్రాహ్మణుల సరగున దోలించు॥

ప్రధాని-క॥ తొందరపడబోకుమియా। సుందరిసావిత్రి తనదుసొబగు శ్రీలగ। అందముగ గూడుకొనిత్తా। నిందులకునురాదలంచె యినవసు తేజా॥ రాజు-వ. ఓమంత్రివర్యా నామాటకు మారుబల్కుచు కా ర్యహానిమాటలు బలికితే నిన్ను శిక్ష జేసెదను.

మం-వ. ఓరాజవర్యా మాటిమాటికి తీక్ష్ణోక్తులు వల్కుచు వంచన జేసితివేని నీసన్నిధానమందు వుండనోవను వినుము భూపాలా.

వ. ఇవ్విధంబున ప్రధాని అచట నిల్వకపోయినపిదప రాజు మగుడి యేరీతి నూరడించు చున్నాడు.

రాజు దర్వు - ఆది.

నన్నుమన్నించుమంత్రివర్య-నీకన్న వేరేవున్నా రెవ్వరుమేరుధైర్య-చిన్నబోకుమీధన్యుడనీవు - నిన్నువిడిచినేనిమిషాముతాళను॥నన్ను॥ పాపామింతేమిజేసితినాకు - నామీదయింతకోపామిప్పుడు సేయబోకు-వోపలేనేనొంటిగనుండగ కాపాడుమి నాకన్నులానసుమ్మి॥నన్ను॥ మారా సుందరాకారుడవు - నామదికిచాల దీరతిచ్చియు జెప్పెదావు - చారు చుక్కపురీ స్వామిసాక్షిగా - కూరిమితో జతగూడియుందామిక॥ నన్ను॥

గీ॥ అడుగపనియేమి రావోయి అవనియందు। నీవులేనిదిక్షణమైన నిలువజాల। సరసకవిగాయకులతోటి సభలు గూర్చి।సంతసింపుచు నుం డాము సార్వదినము॥

ప్ర-గీ॥ ఏలనోయయ్య సమ్మతించలేక నేడు। నీదుగుణమెల్ల దెలి సెను నీకునాతో। కారణంబేమిపోవయ్య ఘనముగాను। రాజ్యమేలుచు నుండుమి రమణతోడ॥

రా-గీ॥ ఏమిజేసితంచు యింతకోపమునీకు। వచ్చుటేమి చెప్పవల యు నివుడు। మంత్రివర్యయింత మంకుజేయుటనీకు। తగదు రమ్మిచాల దయదలంచి॥

వ. ఈరీతి రాజు వేడుకొనగా దయాళుడై సభజేయు మని బిలిచె నెటువలెను. దర్వు - అటతాళము.

సంతసిల్లుచు లేవుమి మంత్రులగూడి సభజేసి కూర్చుండుమి-విం తాగ్రబ్రాహ్మలవే వేగమె నీదుచెంతాకురావించు సెలవిచ్చుటకునయ్య॥ బలువైనవస్త్రములు కుండలములు పసడైనహారములు కలికితురాయి ఖచితమా మకుటాము - వెలలేని కేయూరములు ధరియించియు॥ సం॥ కవిగాయకాదులను చక్కనిభూమి గంధర్వయువతులాను - అవిరళముగ వారి నందరిరావింతు నవరత్నపీఠంబు నయముతో నెక్కాగ॥ సం॥ భేరీ

కాహళేములు తమ్మటలూను భోరున మ్రోయంగను చారుచుక్కాపురి నారసింహుని వేడి వారకబ్రాహ్మణ వరులబిలిపింతు॥ సంత॥

వ. ఇవ్విధంబున రాజును వేడుకొనగా సంతోషాబ్ధినిం దేలి కవి గాయకాద్యష్ట ప్రధానులతో సభ జేసి కూర్చుండుమనెడి ప్రధానితో నేమను చున్నాడు,

సీ. మంత్రివర్యనాదు మాటమదినుంచుము నాచిన్ని సావిత్రి నాతిమ ణికి।యౌవనప్రాప్తమాయెను యేమిసేతును వసుధయందున తగినవరుని కొరకు। అవనిదేవతల నాయాజ్ఞతో బిలిపించి రూపయౌవన శౌర్య రూఢిమెరయు। పురుషుని వెతుక భూమిపై దోలించు ఆలస్యమేలనా యాజ్ఞసుమ్మి। పరగపదిరెండుదివము లేర్పాటు చేసి। తర్వాగ రమ్మని చెప్పుమా ధన్యులకును। రమణతో జనులెల్ల రమ్య మొంది। సరె ననగ పెండ్లిజేతాము సత్వరముగ॥

ప్ర - గీ॥ తాళు తాళుమయ్య తనరుచు సావిత్రి। మతముదెలిసి కొనుట మంచిబుద్ధి। గనుక నీదు చిన్నికన్యను రావించి। వచ్చినాక దోల వలయు సుమ్మా॥

వ. అనిన సావిత్రిని పిలువనంపగ వచ్చె నెటుపలెను.

సావిత్రి రాకడ.



శా॥ శ్రీలక్ష్మీపయుజాత తీక్ష్ణకరుణీ శ్మీతాంశు తేజాంగునిన్
ఫాలాక్షాది సురార్చితాంఘ్రి యుగళు నృష్ణిధ్వజున్ శౌరినిన్
శైలారాతి నరప్రకాంతసఖునిన్ శేషేంద్ర పర్యంకునిన్
వాలాయంబున చుక్కాపురీనృహరినిన్ వర్ణించి నేమ్రొక్కెదన్॥

దరువు - అటతాళము.

శ్రీరమేశా సింధునివాసా-శ్రీనారసింహా। హేమార జనక మం జలభాషా-శ్రీనార। భక్తవేషాధర్మనుభూషా-శ్రీనా। హేముక్తిదాయక మునికులపోషా-శ్రీనా। మీనరూపనిహీరప్రదీపా- శ్రీనా। హేదీన పోషా దివ్యస్వరూప-శ్రీనా। దాసపోష దానవనాశ-శ్రీనా। హేభానురచుక్క పురివాషా-శ్రీనారసింహా।

చె-క। శశివదన నీవుయెవ్వరో । పసిడియపల్లకిలోనాను పనియేమివుడుగా
విశదంబుతోడనీదగు। కుశలంబుగా జెప్పవమ్మ కోరుచు విందుగా।
సా-గీ। అమ్మరోవినవె సంతోష మాయెగాన । సరసముగ నేను తెరవెల్లి సభలోనిలిచి। ధరను జనసమ్మతముగాను త్వరగనాదు । చరిత మెల్లను జెప్పుదు చిత్రముగను।

దరువు - ఆదితాళము.

మిత్రినే చెలిసావిత్రినే చిత్రమైన పద్మనేత్రినె - కోమలగాత్రిరో వినుచిన్నికన్యను వోచెలి। మి। వనితానె జగజ్జన వినుతానె - అనుపమ మగురా యంచల కెవ్వాడు ఘనముగ నృత్యము గరపుదునేచెలి। మి। కొమ్మనే బంగారు బొమ్మనే అతివరోవినగదె ఆణిముత్యముల సొమ్ములు ధరియించెమిత్రినే వోచెలి। మి। మగువానేకోమలి చిగురుల-నగగలిగిన సురవనితకన్నను- బిగ్గిగలదానను ప్రేమతోవినగదె।మి। బాలనే సుగుణ జాలనే-చాలగ చుక్కా-పురిస్వామిని బంగారుపూలతో నిత్యము పూజలు చేసెటి। మిత్రి।

చె-వ. ఓజగన్మిత్రీ విశాలనేత్రీ యీకథయొక్క-కథాభావము యే దైవతార్పణముగ యెవరు రచించినారే కొమ్మా.

సా-క। ధరచుక్కా-పురమందున। స్థిరముగ నెలకొన్ననార సింహుని కరుణగా । నరసింహదాసు జెప్పెను । అరుదుగ సావిత్రి పరిణయంబును వినుమా।

చె-ఉ। ఓనవమోహనాంగి చెలువొప్పెనునామది నిన్నుజూచినగా
మానక నీదునామ మ.వమానము లేకను తల్లిదండ్రినీ
స్థానము దాతదైవమును చానలగూడుక వచ్చుటేమొకో
మానస ముల్లసిల్లగను నాకును జెప్పుమి సన్నుతింతునే।

సావిత్రి - ద్విపద.

అంగనవినవె నన్నడిగినతీరు - పొంగుచుజెప్పెదా పూర్వకథనీకు
నాతల్లిమాళవి నవమోహనాంగి - నాతండ్రియశ్వపతి నరనాథులంద

వరమద్రదేశంబు వసతినాకిపుడు - నరసింహమూర్తియు నాదేవుడమ్మ
ఒకనాడు నాతండ్రి పృథ్వితలమందు - అకలంకచిత్తుడయిఅతిమోదముననూ
సావిత్రినీవేడి సన్నుతుల్ చేయ - యాదేవికృప నన్ను ధీరుండు గనియె
ఈరీతిజన్మించి తింక వినవమ్మ - పేరుసావిత్రియని పిలిచిరే నన్ను
సొబగగుపొలతులసొగసుతోగూడి - నాపయినిదయగల్గు నాతండ్రికడకు
వచ్చితినేచెలి వసుధపయి నన్ను- వచ్చువిల్తునిచేతిబాణమో యనగ.

చెలి-వ. ఓయమ్మా నీవు యేప్రకారంబుగా వచ్చినావో యేరీతి పోగలవో చెప్పవే రమణి.

సావిత్రి దర్వు-జంపెతాళము.

ఇంతివినవె నాదు ముచ్చటంత నీకుదెల్పెదా - పంతమేలనాదు తండ్రిచెంతకిపుడు పొయ్యెదా॥ఇం॥ బాలవినవె తుమ్మెదలనుబోలు కురులు జారగా - మేలిమైన చెక్కుల ముత్యాలసరులు గదలగా - సన్నమైన సింహమధ్యమున్నదా లేదా యనంగ॥ ఇం॥ పరగమణులు భూషణములు మెరసి కాంతులీనగా - గురు కుచంబులందు కస్తురి ఘుమఘుమంచు మెరయగా॥ఇం॥ నుదటతిలక మమర దీర్చి నోట విడియమేయుచూ-వదలకాను చుక్కపురి నివాసునెపుడు దలచుచూ॥ ఇం॥

సా-గీ. చెలియరో వినవె నాతండ్రి చెంతకిపుడు, పొయ్యెదనునన్ను జూచి యాపుడమిరేడు, సంతసిల్లుచు మదిలోన సార్వదినము, కూతు రని నన్ను దయజేసు గాదువ లేవే.

చె-వ. ఓనారీరత్నమ పోదామువదవే చంద్రముా,

సా-సీ. రారమ్మసఖు లంతరంగము ల్విలసిల్ల పుడమి నేతనుజూడ బోద మిపుడు, బంగారు జల్తారు పయ్యెదలునుజార అలినీలవేణి యల్లాడగాను, వర్తులంబగు చనుగవలమీద హారముల్ కుందమ్ములతోడి గొమ రుమిగుల, చెంగల్వదట్టిల చిందులు ద్రొక్కుచు వీణ లందుచు మంద యానములతో, యిటుల మనమంతగూడి ధరణీశుకడకు, పోదమనిచాల నాకిపుడుబుద్ధిబుట్టె, గానబంగారుపతకముల్ గదలిమెరయ,త్వరగపోదాము లెండి యాధన్య జూడ. వ. ఈరీతి చెలులం గూడుకొని తండ్రిసన్నిధికిం బోయి దండప్రణామంబులు జేసి నెటువలెను.

సావిత్రిదరువు - అటతాళము.

దండమూ సత్యాబ్ధిచంద్రమా- నాయన్ననీకు॥ దండ॥ కోరికతో నీదండాకువచ్చితినిదుగో-నిండుప్రేమతోడుతాను,నిల్వక నన్నెత్తుకొమ్మా॥ దండ॥ ఆటలునేనాడివచ్చితి-నామదికిప్రేమనాట నిన్నుచూడవచ్చితి- నో

టులతోఁగూడిపువ్వులతోటలోనే- నాటలాడి నీటుగుల్కఁగాను - బంగారు కాటిగదలా వచ్చితినిదుగో॥ దం॥ చాగచుక్కాఁపురి నివాసుని మదిలోన బూని-భాగుణి విలసిల్లుచుంటిని కూరిమితో నీకునేను కూతురనై నందు కిపుడు-వారకబోటుల కూడివచ్చితి నాయన్ననీకు॥ దండమూ॥

రా-క. ననుగన్నతల్లి రాగదె, కనులను నానందజలము కారగ దొడగెఁ, వనజారిముఖిరో వినునీ, కనుకూలుం డయినపతిని యరయగ బంతుఁ.

రాజు దరువు-ఆదితాళము.

రావె నాకన్నతల్లి రావెనారత్నమా - రావెనాబాలికామణి రావె నాచంద్రమా॥ రావె॥ నినుజూచినంత మనము నీరయిపారునె - కనకాంగినీతో సరిగావనితలులేరు॥ రావె॥ నీరూపు నీదుసొగను నీముఖకాంతితో లేరు-యీధరలోసాటి లెక్కించిచూచిన-రావె. యేమిసేతునీకు యెవరిని దెత్తునె-యీమహియందు రాజుల వెదకదోలించెద॥ రా॥ పుడమిలోపల నీకుదగినపురుషుడు దొరికితె - తడవుసేయకనే నాధన్యాని దెచ్చెద॥ రా॥ నీకు పంతమేలా నీరజలోచన - రాకుమారినీవిపుడు రంజిల్లుచుండావె॥ రా॥ శ్రీవసుధాచుక్కాఁపురివాసునిసాక్షిగ వసుధాధిపతినీకు వరునిగా దెచ్చెదా॥ రావె॥

వ. ఈరీతి నానందంబున గారవించి చెక్కిలి ముద్దాడి శిరంబు మూర్కొని దగినపురుషుని తేగల నని ప్రియభామలచే బుజ్జగించి అంతఃపురంబున కనిపి యున్నంత.

ద్యుమత్సేనుడు భార్యాపుత్రులతో రాకడ.

ఉ. శ్రీతరుణీశ పాపహార శ్వేతముఖధ్వజ దానవాంతకా, ధాతభవానిహృద్ధారసుధాశవరాజనుతాంఘ్రిపుష్కరా, భూతగణేశ దంతినుత పూర్వదిగేశ తనూజమిత్రభూ,చాతవెనీవె చుక్కఁపురిధామ రమానరసింహ ప్రొక్కెదఁ.

దరువు - అటతాళము.

సకలజీవకోటి సంచారదేవ - శ్రీనారసింహా-దేవ - అకలంకమైనట్టి అణుమాత్రరూప-శ్రీనార॥ మూడుమూర్తులకాదిమూలమైనదేవ - నార॥ నీదుజాడ తెలియలేరు త్రిలోకతలమందున - నార॥ జననమరణస్థితి సేయునే ర్పరివయ్యా-నార॥ కోటిదినమణి రూపుతో తేజరిల్లెటిదేవ- నా॥ పదునాల్గు భువనములు ఉదరమున గలదేవ - నార॥ ప్రాణపద మైనజనులను పాలించెదొరనీవె-నారసిం॥ సుజనవందితుడవై చుక్కాఁపురంబున - నార॥ చాలవిజయముచేకొని విలసిల్లనిలిచిన-నారసింహా॥

ప్రధాని - క. ఎవరయ్యా మీరు రాజులు, కవగూడియు యిందు

రాను కారణమేమో, భువిజనులు బొగడుచుండగ, సవినయముగ తెరనువెళ్ళి సరగున జెపుడీ.

తెరవెళ్ళేదరువు - ఆదితాళము.

నేనె భాస్కర తేజుడను నా పేరు ద్యుమత్సేనుడందురు జెప్పెదాను. దీనత్వంబున దేశాము విడిచియు కానసంబునకు కదలివచ్చితి। నేనే। మారానుందారాకారూడను ధరజనులా నెల్ల నేరపుతోడ బ్రోచినను ధీరతతో నిలిచియు పోరున వదలక శూరత్వంబును జూపెటివాడను। నేనే। చారుభూషణములు చేసి నేను జల్తారుగలబంగారు వస్త్రములుదాల్చితి నేను. భూరిశత్రువులాను మీారగెల్చి రణభేరి వేసి ఘనబింకమణంచేటి। నే। నా దుపుత్రుడుసత్యవ్రతుడు భూతలమునందు సాధుసజ్జనుల బ్రోచేఘనుడు - మేదినిగల మెలతలమించియు సాధుగనిలిచినపణతి నా భార్య। నేనే। ధరణిశ్రీచుక్కాపుర వరముననునివసించిన లక్ష్మీనరసింహాస్వామిని మురిపంబున నుమరువక తలచియు మనుజులనందరి కరుణతో నేలియు గణుతికెక్కిన। నే।

ప్రధాని-గీ. అవును నీముచ్చటలు సమ్మతాయె గాని, అంధుడవు నీవు రాజ్యమీా యవనియందు, యెట్లు జేసితొ కీర్తి నీ కెట్లు గలిగె, తెలియబల్కుమి నాతోడ ధీరముగను.

ద్యుమత్సేనుని ద్విపద.

ధన్యుడను వినవయ్యా తగజెప్పెదాను - అప్యత లేక నే నంధుడానయ్యా
పుట్టితిజనులు పెంపొందుచునుండ - దిట్టముగ నేద్యుమత్సేను డనుపేర
అంధుడనయ్యుండి యవని పాలించి - సందేహ మనిపించి సరసజ్ఞులైన
మంత్రులచేత నిమహీని పాలించి - తంత్రింబుతో రాజధానిసాధించి
సకలసుఖములతోడ సంతోష మొంది - ప్రకటితంబుగ కీర్తిప్రజ్ఞుడానైతి
శత్రులుయుద్ధంబు జేసియునాడు - పుత్రునినన్నునా పొలతిమువ్వురను
వెళ్లగొట్టించిరీ వినయంబు లేక - మళ్ళిచూడక మేము మదిచాలగుంది
రాజ్యహీనులమైపూజ్యంబు లేక - వనభూములను మేముచరియింతుమికను
సాధుజనులమై వేడ్కతో యిపుడు - ధరణిచుక్కాపురి ధాముని దలచి.

ప్రధాని-వ. ఓమహారాజా! మంత్రులచేత రాజ్యమేలించి కీర్తిసాధించి యుండుటలో శత్రువులు వెళ్ళగొట్టుట కేమికారణమో చెప్పుమి.

ద్యుమత్సేనుని-గీ. దైవయోగంబునం జేసి ధరలొబుట్టి, నంధుడనై పుట్టి యెనతశయిల్లి, మంత్రులతో రాజ్య మేలించి మహిని చాల, యశము గైకొంటి రా పెక్కు యండ్లనుండి.

ప్ర-వ. అయితే సరేకాని తరువాత ముచ్చటచెప్పుమి రాజవర్యా.

ద్యుమత్సేనుని దర్వు - ఆదితాళము.

వినుమీ వినుపింతునుకదర నావార్తనీకు॥ విను॥ అనువుగనే ముం దవనిపాలించియు - ఘనముగసౌఖ్యంబును - వడసితిరా॥విను॥ పిదపశత్రు వులువచ్చిరి జూదంబునాతో మొదలుబెట్టియు నాడిరి - అదినమ్మియునే నాడుమనుండ ముదమునగెల్చి మమ్మున్నలనోడించిరి॥ విను॥ అవుడు యు ద్ధంబుజేసి నారాజ్యమంత చతురుడనయ్యివోడితి - కపటవాదులీకర్మము జేసిరి వుపము లేక నేనూరువిడిచితి॥ విను॥ మనసులోఖేదామొందక శ్రీచు క్కాపురి వనజనాభునినమ్మితి-తనయుడు నేనీ తరుణిముగ్గురము మునుల వలెను యీవనములో నుండేము॥ విను॥

ప్రధాని-గీ. అయ్యారెూ యింతయేమి అన్యాయమయ్య, సత్యవం తులు మీరు యీజగతిలోన, కష్టపడనేల మారాజు గలడు రమ్ము, పోవ కర్తను జేసు యేప్రొద్దు మిమ్ము.

ద్యుమ-క. మాచిత్తచోర గిరిధర, స్వాచిత్తములోడబ్రోవుసన్నుతి చేతుర్, వోచిత్తజారివందిత, మీచిత్తము యెటులనైన నేలున్నసింహా.

దరువు - ఆదితాళము.

ఏలవత్తునేను సుఖమింకేలనాకు విను - మేలగురాజ్యము మేదిని వైరులపాలుజేసియు పరవానింటికి॥ ఏల॥ రాజరాజునై నేటికి రాజ్య హీనులమై - తేజము లేకను దీనత్వంబున యీజనపతికడ కేమనివత్తును- మొదలే అంధుడను దేశము వదలివచ్చినాను- పదపడినావిధిపగవాడాయె యెదురనడచియు యేమనివత్తును॥ ఏల॥ అతివ నాదుభార్య సత్యవతుడు సుతుడు-ధైర్యయుతులమై పోవలెమైముగ్గురమతులిత మగు యీయడవి లోనుండక॥ ఏల॥ యిలను చుక్కాపురివాసుని తలచెద మదిగోరి తలపడి వైరుల దండనచేసియు బలము చూపియు పట్నము చేరెద॥ ఏల॥

ప్ర-గీ. వినుమి మహారాజ అట్లయితే వేగిరముగ, వనములోపల తపసులవద్దికిపుడు, పొందుదినచర్యగడపుచు నుండవలయు, సత్యసంపన్న నిన్ను నే సన్నుతింతు.

వ. అని వారల సాగనంపియున్నంత నిట రాజు యేమను చున్నాడు.

రా-మత్త. ఎంతజెప్పినగాని నీమది కింతదోచదు సుందరా, ఇంత లోపల బ్రాహ్మణోత్తము లిచ్చలో బిలిపించునా, మంతనంబున చింత గలిగెను మానియుండుట న్యాయమా, బంతులాడుచు నాదుకూతురు ప్రాయమొచ్చుటు వచ్చెను.

వ. అనిచెప్పగ ప్రధానిభటుల కాజ్ఞాపించగ వారలు మహావేగం బునం బోయి బిలిచిన బ్రాహ్మణోత్తములు వచ్చి రెటువలెను.

బ్రాహ్మణుల రాకడ దరువు - ఆదితాళము.

వస్నారమతయ యల్లంభట్లు- వస్నారమరయ్యా వస్నారమయ్యా బంటువాడుతర్లి తర్లిపిలిచిబోయె।వ। తాగినంతనేతిబొట్టుపిడికెడేసిముద్దాపప్పు మీగడపెరుగ్గై తెతాగుతాగుమని పోస్నారమ। వ। శీరవూరినంటన శేషం భట్లు పోచాడమ కోరికతో బోయిమనవారినెల్లపిలువనంపు। వ। బార డేసిఆర్యమమ సన్నబియ్యంపొంగలమ వూరివూరివారుగూడివురికివురికిపో త్తుచున్నారమ। వ। చన్నపంచకట్టెరాగి చెంబుజేత పెట్టుకొని తిన్నగాజుట్టాడగాను తెలియజెప్పివూరికంత।వ।అంటువులునుతియ్యని పొనుగంటిశాఖ మప్పడాలు యింటిలోవున్నట్టివారికి యివ్వరమహూపాయీలు।వ। తొక్కు లూరగాయ మంచి దోసకాయ పచ్చడమ చక్కపూరివానునితోడు నిక్కముగరమ్మన్నాడమ। వస్నా।

యల్లంభ- క. మనవాడు శ్రాద్ధమింటికి,తినబోయెను పిల్వనంపుతీవర పడకే, పనిబడి వచ్చిన బంటును, అనుమానము లేక చెప్పుమని యడుగుదముగా.

వ. అనిన తిమ్మంబట్లె వచ్చినబంటువానితో నేమను చున్నాడు.

యేలలు - బ్రాహ్మ-బంటుసంవాదము.

బ్రా. ఎందుకానిపిల్వానంపె - యేమికార్యామానిచెప్పి-తొంద రేల చెప్ప వేమిర- ఓబంటువాడ, అందరాము వత్తామిప్పూడు.

బంటు. ఏమికార్యమూని నాకు - యెరుగజెప్పలేదోయయ్యా - కామకరమ్మన్నానిచెప్పెను- ఓబాపనయ్యా, యేమిచింత లేదురావయ్యా.

బ్రా. రేపువచ్చేదాము పొమ్మి - కావువాండ్ల లగ్నమున్నది - మాపటికి తాళి వచ్చేము-ఓబంటువాడ, కోపామువద్దని చెప్పుము.

బంటు. వెఱ్ఱిబాపనయ్యాలార - వేగిరముగ తర్లుడిపుడు - బిఱ్ఱు మాటలాడపోకండి-ఓబాపనయ్యా, బుఱ్ఱలు పగులాగొట్టేను.

బ్రా. ఊరువిడిచిపొయ్యేదాము - వొక్కడైనవుండకుండ - కారుమాటలంటె కోపాము- ఓబంటువాడ, మీరిబల్కబోకుమిచ్చట.

బంటు. రాజుబిడ్డపెండ్లికయ్యా - రమ్మని తోలించినాడు - తేజముతోరండిపోదాము-ఓబాపనయ్యా, పూజ్యమయ్యా బాగయ్యానచ్చటా.

బ్రా. ఆలాగైతే సంతోషము ఆలస్యమింకేలనయ్యా-తాళలేను నిజము చెప్పుమి-ఓబంటువాడ, చాలగా దడవేలజేసేవు.

బంటు. నిక్కమయ్యా రాజాయింటనిజముగానే లగ్నమౌను - చుక్కపురిస్వామితోడయ్యా- ఓబాపనయ్యా, గ్రక్కునపోదాము రారయ్యా.

వ. ఇవ్విధంబున జెప్పగా బ్రాహ్మణులు సంతోషమగ్నులై రాజు సమీపంబునకుం బోయియున్నంత రాజుగారు అర్ఘ్యపాద్యాదివిధులపూజించి వుచితాసనాసీనులం జేసి యేమను చున్నాడు.

సీ. బ్రాహ్మణోత్తములారపనిజెప్పెదనుమీరు చిత్తగించివినుడిశీఘ్రమున
ను, నాచిన్నికూతురునలినాయతాక్షికి దగినట్టివరునిభూతలమునందు,
రాజతీవియుబలము రణరంగశౌర్యంబు రూపయౌవనమైన భూపవరు
ని, వెదకిజాడలుదీసి వేగిరమునరండిఘనమైనద్రవ్యంబు గలుగ జేతు,
భయముచేవెతకవస్తిరేనయముగలదు, లేకపోతేను క్షేత్రముల్నికులే
వు, నేటికెనిమిదిదినములు నిలిచె గాన, సరసమున వెదకి రారయ్యా
సత్వరముగ.

బ్రాహ్మణుల దరువు - ఆదితాళము.

ఆలాగాలాగే వస్తాము అవనినాథవినుమా- శీలము సంపద శౌర్యముగలిగిన బాలునిదెచ్చెదము - సంతోషముతోనుమమ్ముల సవరించుమి రాజ-ఇంతలోబాలుని వెదకిచూచి నీచెంతకు దెచ్చెదము-యీసమయంబుననుపోదము యిలపై వెతుకగను - వాసవనుతుడగు చుక్కాపురి నివాసునితోడయ్యా!

వ. అని మరియును తమలో తాము యేమని వితర్కించుచున్నారు.

వ. ఓయల్లంభట్లు వోయిరాజంభట్లు మనమైతే రాజుకెంతమాట యిచ్చితిమిగాని యేరాజ్యముయేభూమి గురుతుయేపట్టము యేరాజులు లేరయిరి దీనికి యేమి వుపాయము చెప్పుము శాస్త్రిలు రాజంభట్లు.

రాజంభట్లు - దరువు - జంపెతాళము.

ఏమిదోచదునాకు ఏమనిచెప్పుదు స్వామిదయనేకాని సమ్మతించరయ్యా! ఈయువనివేదాల వెంకుబొట్లుకు-రాజచాయలునుగురుతు - మన జంటరమ్మనుమి రాజవంశము గురుతు - యీజగముజూచి తానెల్లజూచినాడు-మనమంత వెంకుభట్లను బిలిచి అడిగితె రణరంగధీరులౌరాజులను వలయునుమిన్నా!

వ. అనివెంకుభట్లను బిలుచుకొని సమస్తదేశంబులు దిరిగియెక్కడ గానక తాపలి మనస్కులై మగుడి వచ్చుచుండగా వనమధ్యంబున ముని పోలికలు గలిగియున్న ద్యుమత్సేనునిం గని యేమను చున్నారు.

బ్రా-క. ఎవరయ్యాయిట్టియడవిలో,రవితేజముగలదుశీవి రాజులు వలెను, రవిరశమగురుషిపోల్కెలు, నువిచారుడతెల్పుమిక భూసురులము వినుమా.

ద్యు-క.వినుసాళ్వదేశమునునా, తనయుడునామంబువినుసత్యవ్రతు డనగన్, వనితయు నాభార్యామణి,యును ద్యుమత్సేనుడేను యుర్వీశు లముగన్.

గీ. రాజ్యమంతయు పరదేశరాజులకును,అప్పగించియువచ్చితినడవి లోకి, దైవమిటునమ్ముతప్పజూచుటచేత, మునులమైయుంటిమిప్పుడీ వనమునందు.

వ. ఈరీతి చెప్పగా విని బ్రాహ్మణులుపిల్లవానియొక్కరూపకసౌం దర్యాతిరేఖలం జూచి సరేయని మెచ్చి తలయూచి మరలినపిదప ద్యుమత్సేనుడు కొమారునితో నేమనుచున్నాడు.

గీ. వినుమునాపుద్దులయ్యా యౌవనములోన, మునులసన్నిధికినిబోయి మోదమునను, శాస్త్రములు వేదములు ధనుశ్శాస్త్రమెల్ల, చదువుకొని రమ్మినాపుత్ర జలజనేత్రా.

వ. అని చెప్పగా పితృాజ్ఞ గైకొని సత్యవ్రతుండు ఋషియాశ్ర మంబున విద్యగరపుకొరకునై యున్నంత నట బ్రాహ్మణులు మహా వేగంబునం బోయి రాజుతో నేమను చున్నారు.

బ్రా-క. మనుజేంద్ర మమ్ముగనుమిక, వినుజెప్పెద మొకటివార్త విను మిప్పుడునీ, వనుకొన్నరీతిగానే, యనుపమసుందరుడునీకుఅల్లుడుదొరికెన్.

రాజు బ్రాహ్మణుల సంవాదం - అటతాళము.

రా॥ నీతిదప్పక నాతో నిజముగబల్కుడీ-విప్రవర్యా-మీారు-యే త్రోవబోయితి రెరిగించు డామాట-విప్రవర్యా॥

బ్రా॥ ధీరతతో ఛప్పన్న దేశాలు తిరిగితిమి - రాజవర్యా- ఎంత రారాజులయినాను మీాకుసాటి-రాజవర్యా॥

రా॥ మఱియెక్కడనుదొరికెమారతేజుడుమీాకు-విప్రవర్యా-అతని నిరుపమసౌందర్యనీతులు చెప్పుడీ-విప్రవర్యా॥

బ్రా॥ బలము కాంతికీర్తి ప్రజ్ఞయౌవనమందు - రాజవర్యా-బుద్ధి తలచిలెక్కించగా ధాతవశము గాదు-రాజవర్యా.

రా॥ సరగుననాచిన్న సావిత్రికిదగిన-విప్రవర్యా-అట్టి వరుని పేరే మాని వర్ధిల్లు జగమందు-విప్రవర్యా॥

బ్రా॥ సత్యవంతుడుపేరు సమరాధికారుడు -రాజవర్యా - చాలా సత్యంబునడచూను సామాన్యు డనుకోకు- రాజవర్యా॥

రా॥ కన్నతల్లితండ్రులు వున్నారలేరయ్యా - విప్రవర్యా - వారు- యెన్నాగనుండేటి యేదేశ మెరుగించు - విప్రవర్యా॥

బ్రా॥ అది సాళ్వదేశంబు అంధరాజతండ్రి - రాజవర్యా- బహు సదయుడును ద్యుమత్సేనుండనేపేరు - రాజవర్యా॥

రాజు॥ అంతమంచిదెగాని అంధుడెట్లాయెను-విప్రవర్యా-యికరం తేల సతనికి రాజ్యమున్నద లేదా-విప్రవర్యా॥

బ్రా॥ వరగరాజ్యమంత పగవానికర్పించి - రాజవర్యా - ధర చుక్కవురివరుని దలచి యడవిజేరె-రాజవర్యా॥

రాజు-గీ. రాజ్యహీనమెకాని నేత్రములు బోయె, అట్టిరాజుతో చుట్టరిక మేలనయ్యా, బుద్ధిసమ్మతించ దిక నాకు పుడమిలోన, యింక వెద కియు చూడండి యెవరి నయిన.

బ్రాహ్మణ-గీ. అంధుడయితేమి సేయు నీకవనియందు, యిట్టి వురుషుడుచూడగయెందు లేదు, నీయదృష్టమువలన యానీతిపరుడు, దొరికె ననుకొమ్ము వాకరికి దొరకబోడు.

రాజు-వ. ఓ బ్రాహ్మణులారా యిటువంటి బంధుత్వము మనను కిష్టంబుగాదు కావున మరియొకపిల్లవానిని చూచి రావలయు ననగావిప్రులు మగుడి తిరుగం జాలక సావిత్రిమనస్సు కరిగించవలె నని యోచించి త్వరగా సావిత్రివద్దికి వచ్చి యేమను చున్నారు.

బ్రాహ్మణ సావిత్రి సంవాదం - అటతాళము.

బ్రా॥ అమ్మరో వినవె నీయదృష్ట మేమందుమమ్మ-ముద్దుగుమ్మా॥
సా॥ ఏమివార్తలోకాని యెరిగించి చెప్పుమాయయ్యా - బాపనయ్యా॥
బ్రా॥ మాకుతేజముగలమగడు నీకు మంచిజోడు-దొరకినాడు॥
సా॥ ఏవూరు యేభూమి యేమి పేరు గిరిధైర్యా-విప్రవర్యా॥
బ్రా॥ సత్యవ్రతుడుపేరు సాళ్వదేశము గలవాడు-సొగసు కాడు॥
సా॥ ఎట్లువున్నాడో యిప్పుడే మాని నమ్ముడువాని - వన్నెకాని॥
బ్రా॥ రారాజు బిలయందు రారునీమగనితో సాటి - వినవెబోటి॥
సా॥ అట్లయితె మంచిది యతనిగోరితిమదిలోన-నీదుయాన॥
బ్రా॥ నేనుజెప్పినమాట నీమదినిజమనుకొమ్మ-మాటనమ్మా॥
సా॥ నానోముఫలమేమో నాకేమిదోచదు యింత-సత్యవంత॥
బ్రా॥ నీవుచేసినపూజ నేటికి అనుభవమాయె-సమ్మతాయె॥

సా॥ ఇటువంటి పురుషుని యెన్నడు మాతండ్రి దెచ్చు- దయవచ్చు॥
బ్రా॥ యీచక్కనిపురుషు నెక్కడనేజూడ లేదు- వినలేదు॥
సా॥ ఇలయందు చక్కపురీశునికి మ్రొక్కినాను- నమ్మినాను॥

బ్రాహ్మణ-గీ. చిరుత వినవమ్మ నీయొక్కవరునిరూపు, బలము యౌవనము కీర్తిప్రబలకాంతి, ధాతకైనను వర్ణింపతరముగాదు, నీ యదృష్టము మంచిది నీకు దొరికె.



సా-గీ. ఏమిసేతునేనుయెప్పుడు చూతును, చెప్పగానెమనసుచంచలించె, దైవమిట్లు మమ్ము తగగూర్చినందుకు, నాదుతండ్రెపుడు లగ్నంబు నాకు జేయు. బ్రాహ్మణ-గీ. వనిత వినవమ్మనీతండ్రివద్దికిపుడు, సరగునను బోయి వేడుమీసత్యవ్రతుడు, పురుషుడే కాని మఱియొక పురుషు నొల్ల, ననుచు బల్కుమి వద్దన్న నతని విడకు.

వ. అని చెప్పినంతలో తండ్రివద్దికి బోయి యేమను చున్నది.

క. దండము మద్రధరేశుడ, దండము లరికోటిగర్వదండిత నీకున్
దండము సింధుకృపాకర, దండము నాతండ్రి వేయిదండము లిదుగో.

రాజు-గీ. మళ్ళి వచ్చుటేమి మదికోర్కె సిద్ధించె, వరునికొఱకు వెతకవచ్చినారు, నీకు సమ్మతైన రాకొమారుని గోరు, గడియలోన దెత్తు కమలనేత్ర.

సా-క. ఓగంభీరసముద్రుడ, నేగోరనువరునిగోరు దెట్లు మననునన్, సాగనుద్యుమత్సేనాత్మజు, నేగోరితి గాని పరుల నెమ్మది గోరన్.

రాజు - సావిత్రి సంవాదము - దరువు - అటతాళము.

రా॥ ఓతల్లి యతనిపై వొప్పాదు నీమనసు - బాలికామణి-యితర నాథూల గోరుమి నాడే తెచ్చెద నీకు - బాలికామణి॥

సా॥ అతడెందు కనవద్దు ఆమాట చెప్పమి-రాజధీమణి-మమ్ము జతగూర్చిపుట్టించె సరసిజభవు డిలలో - రాజధీమణి॥

రా॥ అతనితండ్రి పుట్టు అంధుడై యున్నాడు - బాలికామణి- వారు యతివేషధరులయ్యి నడవిలో నున్నారు- బాలికామణి॥

సా॥ రాజ్య ముండగయడవి రాజిల్లెనెందుకు-రాజధీమణి - యింత వ్యాజ్యమెందుకు వచ్చె వనములో చరియించ-రాజధీమణి॥

రా॥ శత్రూలచేతను జగమెల్లా నోడిరి - బాలికామణి - యింత మాత్రము దెలియాక మదికోరె దెందుకు-బాలికామణి॥

సా॥ ఎట్లువుంటే నేమి యితరుల నేనొల్ల - రాజ - యెన్ని గట్లు తిరిగినగాని కాంతుడె నా కతడు- రాజ॥

బ్రా॥ సత్యవంతుడు పేరు సమరాధికారుడు - రాజవర్యా - చాలా సత్యంబునడచూను సామాన్యు డనుకోకు- రాజవర్యా॥

రా॥ కన్నతల్లితండ్రూలు వున్నారలేరయ్యా - విప్రవర్యా - వారు- యెన్నాగనుండేటి యేదేశ మెరుగించు - విప్రవర్యా॥

బ్రా॥ అది సాళ్వదేశంబు అంధరాజుతండ్రి - రాజవర్యా- బహు సదయుడును ద్యుమత్సేనుండ నేపేరు - రాజవర్యా॥

రాజు॥ అంతమంచిదెగాని అంధుడెట్లాయెను-విప్రవర్యా-యికరం తేల నతనికి రాజ్యమున్నద లేదా-విప్రవర్యా॥

బ్రా॥ పరగరాజ్యమంత పగవానికర్పించి - రాజవర్యా - ధర చుక్కవురివరుని దలచి యడవిజేరే-రాజవర్యా॥

రాజు-గీ. రాజ్యహీనమెకాని నేత్రములు బోయె, అట్టిరాజుతో చుట్టరిక మేలనయ్యా, బుద్ధిసమ్మతించ దిక నాకు పుడమిలోన, యింక వెద కియు చూడండి యెవరి నయిన.

బ్రాహ్మణ-గీ. అంధుడయితేమి నేయు నీకవనియందు, యిట్టి పు రుషుడుచూడగయెందు లేదు, నీయదృష్టమువలన యానీతిపరుడు, దొరికె ననుకొమ్ము వాకరికి దొరకబోడు.

రాజు-వ. ఓ బ్రాహ్మణులారా యిటువంటి బంధుత్వము మనను కిష్టంబుగాదు కావున మరియొకపిల్లవానిని చూచి రావలయు ననగావిప్రు లు మగుడి తిరుగం జాలక సావిత్రిమనస్సు కరిగించవలె నని యోచించి త్వరగా సావిత్రివద్దికి వచ్చి యేమను చున్నారు.

## బ్రాహ్మణ సావిత్రి సంవాదం - ఆటతాళము.

బ్రా॥ అమ్మరో వినవె నీయదృష్ట మేమందుమమ్మ-ముద్దుగుమ్మా॥
సా॥ ఏమివార్తలో కాని యెరిగించి చెప్పుమాయయ్యా - బాపనయ్యా॥
బ్రా॥ మాకు తేజముగలమగడు నీకు మంచిజోడు-దొరకినాడు॥
సా॥ వవూరు యేభూమి యేమి పేరు గిరిధైర్యా-విప్రవర్యా॥
బ్రా॥ సత్యవ్రతుడు పేరు సాళ్వదేశము గలవాడు-సొగసు కాడు॥
సా॥ ఎట్లువున్నాడో యిప్పుడే మాని నమ్ముదువాని - వన్నెకాని॥
బ్రా॥ రారాజు లిలయందు రారునీమగనితోసాటి - వినవెబోటి॥
సా॥ అట్లయితె మంచిది యతనిగోరితిమదిలోన-నీదుమాన॥
బ్రా॥ నేను జెప్పినమాట నీమదినిజమనుకొమ్మ-మాటనమ్మా॥
సా॥ నానోముఫలమేమో నాకేమిడోచదు యింత-సత్యవంత॥
బ్రా॥ నీవుచేసినపూజ నేటికి అనుభవమాయె-సమ్మతాయె॥

సా॥ ఇటువంటి పురుషుని యెన్నడు మాతండ్రి దెచ్చు- దయవచ్చు॥
బ్రా॥ యీచక్కనిపురుషు నెక్కడనేజూడ లేదు- వినలేదు॥
సా॥ ఇలయందు చుక్కపురీశునికి మ్రొక్కినాను- నమ్మినాను॥

బ్రాహ్మణ-గీ. చిరుత వినవమ్మ నీయొక్కవరునిరూపు, బలము యౌవనము కీర్తిప్రబలకాంతి, ధాతకైనను వర్ణింపతరముగాదు, నీ యదృష్టము మంచిది నీకు దొరికె.

సా-గీ. ఏమిసేతునేనుయెప్పుడు చూతును, చెప్పగానామనసుచంచలించె, దైవమిట్ల మమ్ము తగగూర్చినందుకు, నాదుతండ్రిదెపుడు లగ్నంబు నాకు జేయు. బ్రాహ్మణ-గీ. వనిత వినవమ్మనీతండ్రివద్దికిపుడు, సరగునను బోయివేడుమీసత్యవ్రతుడు, పురుషుడేకాని మతియొక పురుషు నొల్ల, ననుచు బల్కుమి వద్దన్న నతని విడకు.

వ. అని చెప్పినంతలో తండ్రివద్దికి బోయి యేమను చున్నది.

క. దండము మద్రధరేశుడ, దండము లరికోటిగర్వదండిత నీకు౯
దండము సింధుకృపాకర, దండము నాతండ్రి వేయిదండము లిదుగో.

రాజు-గీ. మళ్ళి వచ్చుటేమి మదికోర్కె సిద్ధించె, వరునికొఱకు వెతకవచ్చినారు, నీకు సమ్మతైన రాకొమారుని గోరు, గడియలోన దెత్తు కమలనేత్ర.

సా-క. ఓగంభీరసముద్రుడ, నేగోరనువరునిగోరు టెట్లు మనమున౯, సాగనుద్యమత్సేనాత్మజు, నేగోరితి గాని పరుల నెమ్మది గోర౯.

రాజు - సావిత్రి సంవాదము - దరువు - అటతాళము.

రా॥ ఓతల్లి యతనిపై వొప్పాదు నీమనను - బాలికామణి-యితర నాథుల గోరుమి నాడే తెచ్చెద నీకు - బాలికామణి॥

సా॥ అతడెందు కనవద్దు ఆమాట జెప్పమి-రాజధీమణి-మమ్ము జతగూర్చిపుట్టించె సరసిజభవు డిలలో - రాజధీమణి॥

రా॥ అతనితండ్రి పుట్టు అంధుడై యున్నాడు - బాలికామణి- వారు యతివేషధరులయ్యి నడవిలో నున్నారు- బాలికామణి॥

సా॥ రాజ్య ముండగయడవి రాజిల్లెనెందుకు-రాజధీమణి - యింత వ్యాజ్యమెందుకు వచ్చె వనములో చరియించ-రాజధీమణి॥

రా॥ శత్రులచేతను జగమెల్లా నోడిరి - బాలికామణి - యింత మాత్రము దెలియాక మదికోర దెందుకు-బాలికామణి॥

సా॥ ఎట్లువుంటే నేమి యితరుల నేనొల్ల - రాజ - యెన్ని గట్లు దిరిగినగాని కాంతుడె నా కతడు- రాజ॥

రాజు॥ నాతోడవినగదె నయము లేదతనితో - బాలికా-నీకు యీ తీరెందుకు బుద్ధి యిచ్చెయించనె తల్లి-బా॥

సా॥ అతని తెచ్చితె కానియవనిలో బ్రతుకానూ-రాజ- నాకు, పతి యతడే నని ప్రాణము నిలిపితి - రాజ॥

రాజు॥ కీరవాణిరో నీవుకోరినట్లుగ జేతు - బాలి - ధరణి, చారుచు క్కాపురి స్వామిసాక్షిగనమ్మి - బాలి॥

వ. ఈరీతి సంవాదము జరుగుచున్నంతలో నారదుడు వచ్చె నెటువలెను.

నారదుని రాకడ దరువు - అటతాళము.

మునికులపుంగవుడరా-మాధవుని- నమ్మి చరియించెదనురా - అను పామసుందరమైనట్టిసొమ్ములు - తలపూన మెరయంగదాల్చి చరించేటి॥ ము॥ పంచరంగుల వీణబట్టుచు సదా-పంచబాణునితండ్రి నెంచుచు-సంచితమైన ట్టిజపమాల చేతిలో మించి ప్రకాశింపమేదినిదిరిగేటి॥ ముని॥ లలితంపుశిఖ మూడివీడగ నుదుట తెలివైనతిరుమాణి మెరయుగ - కిలకిలనవ్వుచు కి న్నెరమీటుచు-యిలయందుచాలగ నలగుచు దిరిగేటి॥ ముని॥ ధారుణిచు క్కపురీశుని మదిగోరి నుతింతు - లక్ష్మీశుని ద్వారకవినుమద్రధరణీశుక డకు నేవారకవచ్చి తివ్వలపొనివ్వర॥ ముని॥

ద్వా-క. ఎవరయ్య మీరలిప్పుడు, అవిరళముగజడల పేరు లంబరముల లో, సవినయముగ వచ్చు టేమియు, ధవళాంగుడ తెల్పవయ్య దారుఢ్య మునన్.

నారదుని - ద్విపద.

వినరోరి నావార్త వినజెప్పెదాను-జననియు భారతి జనకుండు ధాత
బ్రహ్మఋషినిర ద్వారపాలకవినుమీరా-బ్రహ్మాండనాథుని భజియించెదాను
నాయొక్క నామంబు నారదుడనోరి - యీయవనిపై జనులువినుతించెదను
వాసవుపాడజూచి వైకుంఠు జూచి - వాసిగకైలాస వాసుని జూచి
ఘనసత్యలోకేశు గనుగొనిపిదప - వినుమిపాతాళమును వీక్షించిమరియు
మర్త్యలోకమువచ్చిమనుజులజూచి-సత్యవంతులచూచి చరియించదలచి
వచ్చితిరశ్వపతి వద్దికి నిపుడు - మచ్చికతోడనా మది వినిపింప
వరవీణబట్టుచునువాయించుచును - ధరచుక్కపురివాసుదలచిభజియించు.

దరువు - ఆదితాళము.

హరిగోవిందం పరమానందం బాలముకుందం మకరంగం॥ హరి॥
గరుడతురంగం ఘనరుచిరాంగం కరిరిపుభంగం శ్రీరంగం॥ హరి॥
సరసిజనేత్రం సన్మునిమిత్రం సురనుతపాత్రం సుచరిత్రం॥ హరి॥
సురుచిరచేలం సుందరవాలం దురితవిఘాలం శ్రీలోలం॥ హరి॥

శరధిగంభీరం జగదాధారం ధరధరధీరం దధిచోరం॥ హరి॥
ఉరగశయానం వుజ్వలవసనం కరిరిపుదళనం ఖగగమనం॥ హరి॥
తారపురీశం దానవనాశం చారురమేశం జగదీశం॥ హరి॥

వ. ఈరీతి భజన గావించుచు రాజుగారివద్దికిబోయిన శని రాజు యేమనుచున్నాడు.

క. నాపూర్వఫలము మంచిది, మీపూజలు సేయగలిగె మేదినిమీదన్,
యేపుణ్యాత్ములకబ్బవు, మీపాదములిపుడు నాకుమెప్పగదొరికెన్.

నా-గీ. మంగళము రాజరాజేంద్ర మారతేజ, సంతతము నీవు సిరిగల్గి సకలసుఖము, లనుభవించుచునుండుమి యనవరతము, కీర్తిసాధించు మిక నీవు భూతలేశా.

రా-గీ. యతికులేంద్రుడ నీమది నేమిచింత, తెలియజెప్పగవలయును దేవనీదు, పాదసేవకుడై నేనుబ్రస్తుతించి, అడిగితినిగానమదికోర్కెలాన తిండు. రాజునకు నారదునికి సంవాదం - దరువు - అటతాళం.

నా॥ రాజేంద్రయీరమణీమణి యెవ్వరయ్యా- చెప్పవయ్యా॥
రా॥ నాచిన్నికూతూరు నలినాయతాక్షిది- బాల-సుగుణాలవాల॥
నా॥ యింతచక్కనికన్య కెక్కడపురుషుని నీవు- దెచ్చినావు॥
రా॥ యెంతచక్కనిరాజు లెందరినైనసమ్మతించదు- మనసుంచాదు॥
నా॥ చిరుత మాటలు విని మరచియెట్లుంటివిరాజా- కల్పభూజా॥
రా॥ సాళ్వభూవరుకొడుకు సత్యవ్రతుని గోరినాది- మెచ్చినాది॥
నా॥ అట్లయితె మంచిదె యతనీగోరిన సమ్మతాయె- తా మోసమాయె॥
రా॥ మోసమాయెనాని ముక్కుపిరచుట తోచదాయె- బుగాలాయె॥
నా॥ చూడమందరమానుసొగసైనయావన్నెకాని- రూపుకాని॥
రా॥ కరుణాతోజెప్పగ కానియంటు మరికొంత- తగిలెచింత॥
నా॥ పుడమిలోశ్రీచుక్కాపురివరకేసరి తోడు- మంచివాడు॥

రా-గీ. నారదోత్తమనామదినాటెచింత, యెట్టులున్నదొకానినాకెరుగజెపుడి, కపటబ్రాహ్మణులిట్లు నాకడకువచ్చి, సమ్మతిని చెప్పిపిల్ల నరేమి యనగా. వ. ఓమహాత్మా నాకుమూర్తికు నాథుడయినవాడు యెట్లాటివాడో చెప్పుమి మహాత్మా.

నారదుని - ద్విపద.

ఓరాజ వినవయ్య పుర్విపై నతడు - శూరత్వమునదండి శూరుండువినుమి
వనజారికన్న చ[illegible]వాడు - దినమణికన్న మించిన తేజమొప్ప
సకలధర్మాధర్మశాస్త్రములయందు- ప్రకటితంబుగ బృహస్పతివంటివాడు

చిన్నప్పటి పేరు చిత్రాస్యుడయ్యా- ఎన్నగను సత్యంబులన్ని విడుచుటవలన సత్యవ్రతుం డనిజగతిపై వెలసె-అత్యంత ప్రేమగల యవనీశుడయ్యా మరియొకముచ్చటమదినుంచవయ్యా - పరిణయం బాదిగా పన్నెండు నెలలు బ్రతికిజీవించియుపరలోకమందు-అతి వేగమున జేరు నన్నృతంబుగాదు యిదియొక్క టేగాని యింకేమి లేదు- మదిసంశయించెను మనసొప్పదయ్యా.

రాజు-గీ. ఏమి సేతునేను నీయబల కెందుకుఁ, బుద్ధిపుట్టె నతడు పురుషుడనుచు, వలదు వలవదంటె వానిని గోరెను, బుద్ధితుదుర జెప్ప పుణ్యులెవరు.

నారద-గీ. అతనియందు గుణము లధికంబు లున్నవి, గాన వినుము లగ్నమైనవెనుక, నొక్కవత్సరంబు నుండి మృతించును, నీకుగనుక చెప్పి తింతమాట.

రాజు-క. మాకుఁ బరమగురుండవు, నీకుఁ బూజించెదాను నేరుపుతోడఁ, సాకల్యంబుగనివ్వాడు, యీకంజదళాక్షి నతని కిత్తును చెపుమా.

నా-గీ. రాజవినవయ్యయీచిన్నిరమణిమనసు, కోరినటువంటి వరుని కూర్చినిపుడు, మగువ జేసినపుణ్యంబు మంచిదైతె, నత్యముగ చిరంజీవుడౌ జనవరేణ్య,

వ. అని నారదుండు సంతోషించి యెటువలె భజనజేయుచు పోయెను.

దరువు - ఆదితాళము,

భజరే శ్రీనారసింహం - భక్తదురితాపహం కరిరాజసన్నుతాఖ్య గరుడప్రవాహా। భ। హారితతకోటిరూప - హారిహాయపూజితా - నిరుపమ శ్రీతిచేలా-నీరజభూసన్నుత। భ। గిరినాథార్చితాంగ కరుణారత్నాకర - శరణుశరణు దేవ శంఖచక్రాయుధ। భ। వరచుక్కాపురినివాస వనరుహాలోచనా - నరసింహదాసపోష నగవైరిజానభా। భ।

వ. ఈరీతి నారదుడు పోయిన తర్వాత నింక సాధించెదనని తన కుమార్తెను రావించి యేమనుచున్నారు.

గీ. ఇంతమంతనము యెందుకె రామచిల్కా, జోడుదప్పినంతజాడ తేను,అతనిఆయువై తెయర్థాయువని తెలిసె, యేమి సేతు లగ్నమెట్లు సేతు.

సా-గీ. నీవు చింత సేయనీతిగా దేశంద్రడి, మనసుగోరినతని మాన లేను, వనితయందుపతివ్రతధర్మముండెనా,పతికి యెందైనగానియాపదలుదొలగు.

రాజుకున్ను సావిత్రికిన్ని సంవాదము - దరువు - ఆదితాళము.

రా। ఓతల్లిరో నామాటవినుమ-యీతీరయితె నే తాళ లేను। వో।

సా। నాయన్ననీకింతేమిచింత-నాయందికోపా మెందుకుయింతా। నా।

రా॥ కోరినటువంటిపురుషునివద్దు - వారనినిదినితల్లొవద్దు-వో॥
సా॥ యితరచిత్తాము లేదునాయందు-అతని గోరితినామనసందు-నా॥
రా॥ మాయమ్మా రోలగ్నమె నేడు-ఆయే డేమృతిమైపోతున్నాడు-వో॥
సా॥ నానోముమంచిదై లేను-తానేదీర్ఘాయువై బ్రతుకూను-నా॥
రా॥ ఈడునా కేపాటివున్నాది-వాడే కావలెనా దేమున్నది-వో॥
సా॥ ప్రాణమైనవిడిచిపెట్టవలెను-మానమదే జీవించావలెను-నా॥
రా॥ మానాభిమానమనుటాకు-చాలాయింతాపంతమూ యెనీకు-వో॥
సా॥ మనసుబోయినతరువాత-తనువునిల్చిన రీతిగాద-నా॥
రా॥ యేలనేతల్లి ధర్మములన్ని-చాలవిడనాడ నేర్చితివిన్ని-వో॥
సా॥ ధారుణిచుక్కాపురీశుని-వారాకతలచి నేవరియింతునేవాని-నా॥

వ. అనినఅశ్వపతి తనమనస్సునిలుపంజాలక ప్రధానితో ఏమనుచున్నాడు.

రాజు-గీ. వినుమువోమంత్రి నేడుసావిత్రిమతము, సత్యవ్రతుగోరినాదియాజనవిభుండు, పరిణయంబాది నొక్కవత్సరముబ్రతికి, చచ్చునంచును నారదుండు జెప్పి పోయె. ప్రధాని-గీ. అందు కేమి నేతును యవనియందు, మనకుసమ్మతించి నటువంటి మనుజవరుని, దెచ్చిలగ్నంబుజేతాము మచ్చికలర, తనయకునుబుద్ధి జెప్పుమిా జనవరేణ్య.

రాజుకు ప్రధానికి సావిత్రికిన్ని సంవాదము - దరువు - అటతాళము.

రా॥ వినదూవినదూ నేజెప్పితె మానదూ మానదూ మానాక నీవైన మరపించుబుద్ధి॥ ప్ర॥ కోరూమి కోరూమి తలచినవరకు - మారకుమారకు వారిజాక్షిరో నీదు వరునిదెమ్మనుమి॥ సా॥ మానాను మానను ఆమాటలు వినసూ-వినసూ ధ్యానమందుంచినవాని నేవినసూ॥ ప్ర॥ మానదుమానదు నేజెప్పితె వినదు మానాసమందిడిన మగనిదెమ్మనెను॥ రా॥ ఏమి నేతునిక నావుత్రికి ఏమిదోచక దిక భామానుయిటువంటి మంకువద్దనుమిా॥ ప్ర॥ కల్లగాదువినుమా నామాటలువుల్లమందిడుమా-తల్లిదండ్రులమాట తగనమ్మబోకు॥ సా॥ యిందరికిజెప్పి నేగోరిన సుందరుని విడతునా- గంధర్వలగ్నంబు వేగ జేసికొందు॥ ప్ర॥ యెంతకని చెప్పేదు నామాట మంత్రైన గైకొనదు-పంతముచేసినా పతియాతడనెను॥ రా॥ తగదు తగదనుచు ఆబుద్ధులు తప్పవద్దనుమిా-ఈడ వేలనా రాజు దారిద్రుడనుమా॥ ప్ర॥ చిత్తగించుమిక నామాటలు-వుత్తమ మనుకొమ్మిక అత్తకుదారిద్రము నిజమనుమా॥ సా॥ యెట్టివారయినను రాజ్యము లేక గట్టుతిరుగగాను- గట్టిగ నాతడు శాంతూడె నుమ్మి॥ ప్ర॥ వలదువలదంటేను ధర్మము నాకు కలదా- నేనుతలచినపురుషుని తగవిడువనెను॥ రా॥ ఏలకోరితివే నాచిల్కా-నీత్రు-

యిలయందు యింకొకని తలచుకొమ్మనుమి॥ ప్ర॥ వ్యర్థామువో రాజ కుమారిరో వినుము-అర్థాయువనివాడు అదినిజము మనకూ॥ సా॥ మన సుబోయినాక పతివ్రతమనను-బోయినట్టేను మానక చుక్కాపురి మా ధవుసాక్షిగ॥

ప్ర-గీ. వినుమి రాజేంద్ర నీబిడ్డవినదుగాన, నారదునిమాటసత్య మని నమ్ముకొని, నేడులగ్నంబు నియమించి నిఖిలజనుల, సమ్మతముగను జేయుమిా జనవరేణ్య.

వ. ఇవ్విధంబున జెప్పిన రాజు భగవత్ చరణ కంజములయందు చిత్తంబు నిలిపి యేమను చున్నాడు.

రాజు- సీ. వినవోయిసుందర మనబాంధవులకును శుభపత్రికలు వ్రాయు చోద్యమునను, తగతురంగంబులు కమనీయమైనట్టి వస్త్రముల్ భూషణావళులుగూర్చి, లగ్నంబునకు నేమి లక్షణంబులుగలవో సంతో షమునగూర్పు సత్వరముగ, ముత్తయిదులను గూర్చి ముదముతో విప్రు లరప్పించుమిా వేడ్కరయముతోడ, పరగనీవేళ లగ్నమని పట్టణములో, వీధివీధులయందును వింతగాను, చిత్రముగసాటించియు చిన్నపెద్ద, లంద రికి తెలియసేయుట కాజ్ఞసేయు.

వ. ఇవ్విధంబున యాజ్ఞాపించియు మగుడ వితర్కించి ప్రధానితో నేమను చున్నాడు మనకు తగిన చుట్టములు గాక రాజ్యహీనులై సంతు లేక అరణ్య సంచారులై యుండిరిగాన మనబంధుజన భృత్యసైన్యం బులు చూడగ రారాజుల యెదుట లగ్నంబు సేయ మనస్సు హెచ్చదు గావున బ్రాహ్మణద్వయంబును సావిత్రిందోడ్కొని యచ్చట అరణ్యం బునందు చేయవలె నచటికి పోవలయును.

ప్ర-గీ. సత్యమేనయ్య యీామాట జనము వింటె, వేదవారలకును చిన్నబిడ్డ నిచ్చె నంచు హెచ్చరిక లేక వాదించగలరు. చిరుతకు యడవి లగ్నంబు జేయవలెను.

వ. అనిన యీామాట నిక్కంబని రాజు తన ప్రధానిం గూడి బ్రా హ్మణద్వయంబును సావిత్రిని భటులను దోడ్కొని రథంబు నెక్కి అడవి కిం బోయి ద్యుమత్సేనునితో నేమను చున్నాడు.

రాజు-గీ. ధరణినాథేంద్ర సత్యాదినిపుణ, కోరివచ్చితి మునిరూప కుటిలదూర, బాంధవుడవంచు నమ్మితి భక్తితోడ, సాళ్వభూనాథ వే నమస్కారములును.

సంవాదము-దరువు-అటతాళము.

దుష్య॥ ఓరాజమీరెయొక్క వూరుపేరేమందురయ్యా- చెప్పరయ్యా॥
అశ్వ॥ మద్రదేశము మాదేశమందురో యయ్యా- వినవయ్యా॥
దుష్య॥ యేమిపేరునీది యెందుకువచ్చితివిందు- అడవియందు॥
అశ్వ॥ అశ్వపతినిపేరు అతివనిశ్చ్చెదను మన్నించు- దయయుంచు॥
దుష్య॥ అడవిలోపలమమ్ము నపకీర్తిసేయాగనీవు- వచ్చినావు॥
అశ్వ॥ వియ్యమొందెదనంచు వేగిరమున వచ్చినాను-దయతోను॥
దుష్య॥ సంపన్నులుమీరు సాగామీతోటి మాకు- తెల్వబోకు॥
అశ్వ॥ కలిమి లేములురెండు కలయచీకటి వెన్నెలయ్యా-నమ్మమయ్యా॥
దుష్య॥ అతివసుందరినీకు మారునికిచ్చుట నీకుమోసము- చాలదోషము॥
అశ్వ॥ అడవిలోనుండగ అతివమననుకోరినాది- మెచ్చినాది॥
దుష్య॥ యతులమయ్యమేము యడవిలో దిరుగుచున్నాము-ముగ్గురాము॥
అశ్వ॥ సాధూలపై ప్రేమ సావిత్రికి చాలనుండు-కోరుచుండు॥
దుష్య॥ అయ్యయోయిటువంటిఅబలకెందుకుయింతకష్టము-మాతోనిత్యము॥
అశ్వ॥ యిటువంటిబుద్ధిమీరాత్మలో దలచకండి- యేలుకొండి॥
దుష్య॥ ఏలుకొందుముగానియబలమాతోయడవినుండదు-మనసుపొందదు॥
అశ్వ॥ వసుధచుక్కావురివానుడు మిమ్ము పోషించు-సవరించు॥

దుష్య - క. దారిద్రుల మయ్యుంటిమి, మారాజ్యము పరుల కిచ్చి మదిగుందియునీ, ఘోరాటవందు నుండగ, నీరాజసుఖిని మాకు నిచ్చుట తగునా.

అశ్వ-క. నమ్మకుదారిద్ర్యంబును, నమ్మకు సిరిసంపదలనునమ్మితి వేనిన్, నమ్మించి కొనకు జెరుచును, నమ్మతితో రెంటినొక్క సమమన వయ్యా. వ. అనిచెప్పిన మంత్రిని బిలిచి యేదోయొకరీతిచేత నతని మనస్సు కరిగించు మనె నెటువలెను.

సంవాదము దరువు - ఆదితాళము.

అశ్వ॥ మంత్రివర్యనామాటగ్గి కొమ్మితంత్రముతో పోయిదయజేయుమనుమి
మం॥ రాజేంద్రయీరమణి గయికొమ్మి నీజన్మఫల మింతా యె నుమ్మి॥
దుష్య॥ యేలనుమీతోటి వియ్యంబు చాలకెందుకు యీబహుకష్టంబు॥
మం॥ మాకోటివారల కెందుకనియేమేము భాగ్యహీనులము వద్దనియె॥
అశ్వ॥ భాగ్యాము లేకున్నానుగాని యోగ్యమాని తెలుపునుజ్ఞాని॥
మం॥ యీపిల్లకోడలైతేను శ్రీపతిమీకు సిరు లొసగును॥
దుష్య॥ దేశమెల్లనోడివచ్చితిమి భాసురాంగి యిట్టి బాధకోర్వనుమ్మి॥

ప్ర॥ యెంతాకుజెప్పినగాని వినవు యింటికి కష్టమెందుకన్నాడు॥
అశ్వ॥ జోటికినీనుతుపై ప్రేమనాటినదని తెలియజెప్పుమా॥
ప్ర॥ సుందరీప్రాలన్నియు నీదునందనునిపై నుంచినాది॥
ద్యు॥ద్వారకగానినీమనసు చారుచుక్కాపురి స్వామిరక్షించు॥

వ. ఇట్లు సంతోష పడగానే అశ్వపతిరాజు ద్యుమత్సేనునితో నేమను చున్నాడు.

క. రాజేంద్ర నీసుతనయుడు, యోజాగనునున్నవాడో యెలమితో నివుడా, యాజానుబాహునిప్పుడు, నేజూచెదపిల్వనంపు నిక్కమునుద్మ్గా.

వ. అనగా మునియాశ్రమవాసు డయిన సత్యవ్రతునిపిలువనంపెను.

సత్యవ్రతుడు తెరవెడలుటక్దైదరువు - ఆదితాళము.



జ్ఞానసాగరచంద్రుడనురావినరా సేను-ద్యుమత్సేనుని ప్రియ కొమారుడను- గానలోలు పదకంజయుగంబును- మానకతలచిన మనుజాధిపుడను॥ జ్ఞా॥ కోటికోటిసూర్య తేజుడనురా - ధరలోన నాతోసాటి లేరుర జెప్పెదనురా - నాట గౌలకర్ణాటాది గంభీరాద్యరులను నేరణములో గొల్చెద॥ జ్ఞా॥ సకలశాస్త్రంబులు చదివినానురా ధర్మాదులందు ప్రకటితమైప్రజ్ఞానుడనురా-వికలుమమైన నడతగల్గి బల్నుకుమారుండనుగుణాత్మక వినుు॥ జ్ఞాన॥ ధరణీజనులాను బ్రోచెదనురా మదిని సంతోషకరముతో డుత చరియింతునురా-ధరచుక్కాపురి నరసింహదాసునివరదుడై నరహరిని భజించెద॥ జ్ఞాన॥

ప్ర-గీ భళిరనినుజూచితే నాకు భ్రాంతి గల్గె, ధన్యచరితుడ నీతల్లి తండ్రినామ,ములను జెప్పుమి నాతోడ మోదమలర, యెచటికరిగేవు వచ్చితి వెచటనుండి.

సత్యవ్రతుని - ద్విపద.

నాతల్లిభద్రాంగినవమోహనాస్గి-నాతండ్రిద్యుమత్సేనుడనియండ్రుభువిని
మాపట్టణమునుసత్యాపురియనుము - నాపేరు సత్యవ్రతు డనిపిలుతూరు
జనకునియాజ్ఞచేమునిఆశ్రమమున-వినయంబుతోజదువుకొనుచు నేనున్న
ఇమ్ముగాశాస్త్రంబు లెల్ల జదివితిని - రమ్మని పిలిపించెరా నాదుతండ్రి
పిలచినావిద్యలోపల మర్మమేమి - నలరుచునడుగునో నాతండ్రిలిపుడు
చూడబోవలెనంచు పొగనుటో నేను - నేడెందు గడిగ్రయెన నిల్వక వస్తి
సరగునబోదాము జనపతినిచూడ - ధరణిచుక్కాపురిధాముని నమ్మి.

ప్ర-వ. అట్లయితే నరహరిని భజియించుచు పోదాముపదవయ్యా ధీరా.

సత్యవ్రతుని దర్వు- ఆదితాళము.

కరుణాసాగరనన్ను కరుణించియేలరశరణాశరణ్య నారసింహదాసాశ్రితా॥కరు॥ నిన్నువిడువగజాల నన్ను మరచుండాకు పన్నగశయన నన్ను పరునిగచూడకు॥కరు॥ నాతండ్రిబిలువనంపెనన్నాదరించుమిా- ఖ్యాతిగలదివి నట్టిఘనత చూపించుమిా॥కరు॥చదువుతోమర్మమేమి సాధించియడుగునో- పదిలముగ నాదుజిహ్వపై నివసించుమిా॥ కరు॥ దండిరక్షకనీదు దయకుపాత్రుడను-సంతోషమున నన్ను సవరించుమ్రొక్కెద॥కరు॥ ధరణిశ్రీ చుక్కాపురిధామ కరుణించుమి - దురితాపహారవు నిన్ను దొరవాని నమ్మితి॥ కరు॥

వ. ఈ ప్రకారముగా ప్రస్తుతి చేసుకొంటూ పోయి జనకునికి మ్రొక్కి నిట్లనెను.

క. దండము సత్యసముద్రుడ, దండము సర్వప్రకాశ ధరణీనాథా
దండము సన్నుతబలనీ, దండకు వచ్చితినితండ్రి దయగుణశాలీ.

ద్యు-క. రారా నాబంగారా, రారా నాముద్దులయ్య రారాతండ్రీ
రారా చిన్నికుమారుడ, రారా చదివినవినాకు రమణతో జెపుమా.

ద్యుమత్సేనునికిన్ని సత్యవ్రతునికిన్ని సంవాదదర్వు-ఆదితాళం.

సత్య॥చదివితి పెక్కుధర్మశాస్త్రంబులన్ని నాచార్యదృష్టి మొదలుగచదివితి॥ ద్యు॥ యేమిజదివినావుయెరిగింపుమిప్పుడు నామిాదదయదలచి నాకువినుపించు॥ సత్య॥ తిరుమంత్రద్వయ చరమంత్రంబుల దెరగెల్లచదివితి వరుసతోనవవిధంబులగురుతులు తెలిసితి॥ ద్యు॥ పరమసంతోషమూయెపలుకులువినగను- నిరుపమనుందరాంగనేజేయుపుణ్యము॥ సత్య॥వాసి

గతమరు మంగళాశాసనంబు వాసికెక్కితి నాదుభాగ్యమేమందును॥ ద్యు॥
మెవరియాశ్రమమునందు నవరించియుంటివి. అవిరళముగను వారి ఆఖ్య
యేమందురు॥ స॥ వినుమిభార్గవు డనెడిమునియాశ్రమమున. అనువొంద
గానుహరియనుమణి మొదలిడి॥ ద్యు॥ వినుమినాతనయ నేడువనములోపలను.
మనకొక్క మేలుగలిగెను మమతనీడేరును॥ స॥ మేలేమిసంభవించె మేది
నినాయక. ఆలీలయెట్టిదో నాకానతివ్వుడి॥ ద్యు॥ పరమసంతోషు డశ్వపతి
తనతనయను కరుణాతోనీకు పెండ్లిగావించెదరట॥ స॥ ధరను శ్రీచుక్కా
పురిధాముని కరుణతో. జనకునిచిత్త మెటుజేసినసన్నుతి॥ సత్య॥

వ. ఈరీతి ప్రియసంభాషణలచే సంతుష్టులై యున్నంత అశ్వపతి పిల్లవాని సౌందర్యాదిగుణంబులు చూచి యానందితుడై ప్రధానితో నేమను చున్నాడు.

క. సుందర వినుమాపిల్లడు, కందర్పుని మించినట్టి కాంతియు గలదీ
యిందుముఖనిచ్చుటకుతగు, పొందుగబంపించుమిపుడుభూసురవరుల౯.

వ. అనిన ప్రధానింపిల్లవాని జాగ్రత చూచెద నని సత్యవ్రతునితో నేమను చున్నాడు.

ప్ర-గీ. వినుము వోసత్యవంత నావిన్నపంబు, నిను నడుగుసమస్యలు వినిపింపవలయు, చదివినటువంటి చదువు నీజాగ్రతంత, జూపి సంతుష్టి చేయుమి భూపతనయ.

ప్ర-వ. విరాట్కంకణనుత నృసింహరాతుసదంసా అని సమస్య యిచ్చిన సత్యవ్రతుండు. సత్య-క. వట్కంత మాత్రు నుతనుళవ, రాట్కరికర హస్తయుగళ రాజితవిప్రా, వృట్కాల మేఘనిభఫణి, రాట్కంకణ శ్రీనృసింహ రాతుసదంసా.

వ. ఈరీతి సమస్య నింపగానే ప్రధాని సంతోషమగ్నుడయి రాజుతో నేమను చున్నాడు.

గీ. అహహ యిటువంటి చిరుత డీ యవనియందు, దొరక డిక మనము నిప్పుడే తోయజాక్షి, నివ్వవలయును రాజేంద్ర నీతిపరుల, బ్రాహ్మణుల పిలువదోలింతు పరిణయముకు.

రా-వ. ఆలాగైతే త్వరగా పిలువవలయును మంత్రీ.

ప్ర-వ. అనిన ప్రధాని బ్రాహ్మణుల పిలిపించె నెటువలెను.

వ. ఓరిచారుడా శంకర భట్లను, శేషంభట్లను పిలువవలయును.

చా-వ. ఓహో దొరలు పిలువగలము, ఓరంకులంబొట్లు, ఓశంకరంబొట్లు రాజుగారి ఆజ్ఞ అయిన దని ప్రధానిని పిలువ సాగిరండయ్యా.

బ్రాహ్మణుల వచనం.

బ్రా. వినవయ్య యెన్నవృత్తది నిన్న దివారాత్రాలు పూజ్యం యీ వేళ యేమి లేదు రేపు త్యాజ్యం తెల్లవారుజాము రాత్రివరకు యిరు వయిపదిన్నరకు మూడుబొట్లు రెండుపిఱ్ఱలసందున కన్యామూలకు ప్రవేశింపగా శుక్రుడు వెళ్ళిపోయి బాగ నిదురించును.

బ్రా. వధూవరులకు వర్ణవశ్యతారాదృష్ట కూటాదులు బాగానె వున్నవి గావున ఉదయలగ్నము చేయవలెను.

చా. అదిగాదయ్య బాపనయ్య వెధవలకు బలువుగూటాలు బాగా వున్నవి రాహుకాలం నీకు లేదు నాకు లేదు మనపగవాండ్లనుపట్టిదండించును అన్ని కార్యములకు జాము రాత్రికి వృద్ధి అవుతుంది గడియలో శాంతి కెంది వంగుతుంది గనుక పిల్లవానికి తెలుపవలయును.

బ్రా. శ్లో. తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం దైవబలం తదేవ, విద్యాబలం చంద్రబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రి యుగస్మరామి.

చారు. అదిమంత్రం కాదయ్య నేను మంత్రించగలను యెక్కటిమి త్యాహి దిగితి మేవాపురంధే తాతమేన్యం వుభ యోర్ధదదదేభ్యః ఇంద్రియం విసృద్య విప్రాణో భవతి.

వ. ఈరీతి శుభముహూర్తము లగ్నంబుగావించి బ్రాహ్మణులకు అనేకసంభావనలు యిచ్చి తనపట్టణమును గూర్చి పోగలవాడై ద్యుమత్సేనునితో అశ్వపతి యేమను చున్నాడు.

దరువు - అటతాళము.

బావదయనుంచుమా - నేబాయ్యెద బాలకనినేలుమ- యీవేళ నావుత్రి నిచ్చినందుకు దీని- యేవిధంబుననైన యేలిసవరించుమి॥ బా॥ దూర దేశముననున్నాము పోషించేటి భారాము నీదేయుంచుము- కీర వాణియేమి నేరదు పనులందు ధీరతతో తనచేత తినదిప్పటికి॥ బావా॥ కడుపులో దయలుంచుమి కనులతోటిపొడువుతో భయముంచుమి- అది పాడివచ్చి అమ్మనెయీపప్పు బోడియెప్పటికైన బువ్వ్యడుగనేరాదు॥ బా॥ పోషించనీభారము భాషింపనేరాదీ బాలా- నెట్లయినవి శేమంబుతో దీనిచే పట్టియేలువారా॥ బా॥ నాపుత్రిగాదనుకో నీవుగన్నట్టి నీపుత్రిగభావించుకో- యీప్రొద్దునే నైతె విడిచిపోతున్నాను కాపాడిపోషించు కలుగు కీర్తులునీకు- తలిదండ్రిమీరె సుమ్మిఅలిగినప్పుడు యేమిఅనకమన్నించుమి యిలచారు చుక్కాపురీశుని కృపతోడ॥ బావ॥

గీ. బావ నేపోదు యీచిన్ని బాలయిపుడు, తెలియక మెదిలితే దీక్షచేసి, తప్పుచేసినకోపంబుతలచకెపుడు, కన్నబిడ్డనిభావించికరుణగనుమీ.



వ. మరియు తన అక్కైన భద్రాంగితో నేమను చున్నాడు.

అశ్వపతి భద్రాంగుల సంవాదం - అటతాళము.

అశ్వ॥ అక్కరో వోయక్కా చక్కానిచెలిని మన్నించుమి పోషించుమి - అన్నవోయన్ననాకన్నబిడ్డవలె జూతును దయసేతును - అశ్వ కడుపుగాదునాది కడుపునీదనిభావించుమి ౘవరించుమి॥ భ॥ వొక్కకోడలునాకు ఓపికతో మెదలింతును సంతోషింతును॥ అశ్వ॥ యెట్లయిననీదయ నేనేమిసేతునె పోయెద నీకుమ్రొక్కెద॥ భ॥ అట్లయిన పనియేమి అతివ నాయింటిదినమ్ము మాప్రాణము॥అశ్వ॥ చిన్నప్పటినుంచిచేతులతో బెంచి తెచ్చితి మీకుయిచ్చితి॥ భ॥ యిచ్చితేమాయె నీవెందుకు - చింతజేసేవు అన్నారవు॥ అశ్వ॥ బిడియాముతో నిమ్ము పిలువకున్నుగాని పిలువుమీ యనతలువుమి॥భ॥ కోడలుగాదు నాకూతురనిభావింతుచ సంతసింతును- ధరణిచుక్కాపురి ధాముని సాక్షి పోషించుమి దయలుంచుమి॥

గీ. అక్క నేనోదు కోడలి నాదరించు, తల్లి నెడబాసియుండని తరుణి నివుడు, విడిచిపోజాల నక్కరో కడుపునిండ, చాల దయలుంచి యేలుకో సన్నుతింతు. వ. మరియు బిడ్డతో నేమచు చున్నాడు.

దరువు - అటతాళము.

తల్లీ నేవోయివత్తునమ్మ నాచిల్క నీదుతల్లిపై చిత్తముంచకమ్మ- కల్ల బుద్ధులు కడకుంచియు నీవెల్లకాలము వారాజ్ఞలోనుండుమి॥త॥ నీ అత్తజెప్పిన పనులాయెడను మది వేసాటపడక చిత్తముంచియు మెదలవలెను - సత్తచేతమీ అత్తకోపించితె మత్తురాలవయి మారుమాటాడకు॥ త॥ మాకోసమును చింతపడకు - నాతామచిల్క మాకు నపకీర్తి మాటదేకు - వోకంజాక్షిరో ఓపిక గలిగియు లోకులు మెచ్చగ లోలా

క్షుండు - బుద్ధికలిగుంటివేని నిన్ను నేకీర్తమునను ముద్దుగా తోలుకా పోయ్యెదరు- హద్దులేక నీవటుయిటు తిరిగితె బుద్ధివచ్చును పదుగురిలో పల॥ త॥ నొక్కచిత్తముతోను వుండు పతిసేవలోన చిక్కి నేనున్నశరణు బొందు - చుక్కాపురీశుని మ్రొక్కినుతించియు - చక్కగ మెదలుమి సరసిజనేత్రి నాతల్లి॥

వ. మఱియు అల్లునితో నేమను చున్నాడు.

దరువు కురుచ - జంపెతాళము.

భూతలవరతనయా తేజోమోదముతోడ నాతిని పోషించురాజా॥ చిన్నప్పటినుంచి నిన్నగోరెను మదిలో మన్నించిపోషించు రాజా॥ తల్లి తండ్రి నీవె దయనేయుటకు నీవెకల్లానేయకను నేలు రాజా॥ అత్తమామల కన్న ఆత్మ నీయందుంచియు చిత్తామురంజిల్లురాజా॥ నాపుత్రిమణిపనికి వోపజాలదునుమ్మి కోపమునేయాకు రాజా॥ అక్కకోపించితె అలిగియు న్ననుగాని మక్కువగూడుమిరాజా॥ వరచుక్కాపురీనున్న నరహరికరుణతో చిరుతాను పోషించు రాజా॥

గీ. సతులకును సకలభాగ్యముల్ సంపదలును, యెన్ని లేకున్నగాని తనవిభునియొక్క, కరుణగలిగితె వ్యాజ్యము లక్కడను దొలగు, కానకరుణించి యేలుకో మానవేంద్రా.

వ. ఇవ్విధంబున ఆలింగనాది పూర్వకముగ వేడుకొనిన పిదప సావిత్రి తన అత్తమామవరునిపోలికెం దాల్చి భగవస్తుతిచేసె నెటువలెను.

దరువు - ఆటతాళము.

నరసింహానీదివ్యనామంబుదయనేయుపరమానందంబుతోడ ప్రస్తుతించెద దేవ॥ నర॥ దినమణి తేజాశ్రీవనితారమణేశా- నీఅనుపామ కృపతో నన్నాదరించుమి దేవ॥నర॥ ముక్కంటివినుతనా మొరవిని వేగమె - దక్షించినేలు శ్రీచుక్కాపురీవాసశ్రీ॥ నర॥

సీ. నానోముఫలముచే నవమోహానాంగుడు పతిదొరికె ననిచాల సతిశయించి, పతిలగ్నమైనాక పరగయేడాదికి మృతిబొందు నంచు నారదుడుచెప్పె, యింకనాలుగుదినము లీవేళకునునిలచె యిక యేమి సేతునే నెందుబోదు, పతినిప్పు డెవ్వరు బ్రతికించువా రేది యేదైవముకు ముడుపు లిత్తునిపుడు, ఏమిసేతును దైవంబు యెటుల దెచ్చె, ఐతె చేసేది యేమున్నదతనికొరకు, వ్రతముదలపెట్టిచేతు నీవేళ నుంచి, నాల్గుదినములదనుక నాహార మిడచి.

వ. అని నిశ్చయించి వ్రతారంభనిమిత్తమై అత్తతో నేమనుచున్నది.

సంవాదం - ఆదితాళము.

అత్త! సావిత్రి నీమది సంశయంబేమమ్మ - సన్నుతాంగి యిప్పుడీ విన్నపంబులుయెరిగించునాతో - సన్నుతాంగి! సా! అడవిలోనాకొక్క అపేక్షగలిగేను! అత్త! యంత - తడవుసేయక మీరు దయసేయుడిప్పుడు అత్త! అత్త! అబలనీకిపుడేమిఅపేక్షగలిగేను - సావిత్రి!యింత-శపథమేల సునాకుమేలూగజెప్పు- సావిత్రి! సా! వ్రతమును జేసెదవాంఛతోనీనేళ అత్తగారు - అతిప్రేమతో నాకు ఆనతివ్వుడివేగ! అత్త! యేసామీవ్రతం యిచ్చయించవెతల్లీ - సావిత్రి! దాని - నేమముతోచెప్పు నెలతారోనా తోటి- సావిత్రి! సా!అఖిలసంపదలకై యాదరించెదవ్రతము-అత్త! వోసఖి వినునాలుగు దినంబు-లువవాసంబు అత్త! అత్త!అట్లయితేమంచిదె అతి వారోచయ్యేము- సావిత్రి! నీవెటుజేసినగాని విహితామెమాకిక-సావిత్రి! వరచుక్కాపురినున్న నరహరికరుణచే - అత్త!నినుమరువకపల్కెద మన్నిం చుడికనన్ను- అత్త! సావిత్రి-క. మీపాదసేవ జేసియు, నాపాపము లన్ని విడతు నయముగనన్నుక, కాపాడివారలిప్పుడు, మీపాలిటి దాసినయ్యి మెలగుచు నుందుగ.

అత్త-క. ఓయమ్మవ్యాజ్యమెందుకు,నీయందునచాలగలవునీతులుచూ డగ,యేయింతులిట్లుచూడము, మాయింటికిలక్ష్మివయ్యెమమురక్షించు.

వ. ఈరీతిసంతోషపడి యాజ్ఞయివ్వగాను సావిత్రి వ్రతారంభంబు చేసి దేవతాధ్యానంబు చేసె నెటువలెను.

దరువు - జంపెతాళము.

నారాయణదేవ నాపాలిదైవమ కోరిమీపాదములు గొలచి భజి యింతుగ-సాగరాత్మజనిన్ను సన్నుతించెద మదిలో బాగుగనుసవరించు పసుపుకుంకుమను- దండధరనీకు నేదండమర్పించెదను నిండుముత్తయిదు వని నీతిగాపాడు - పరమేష్ఠినిన్నునే ప్రస్తుతించెద పతిని పరగదీర్ఘాయువని పాలించవయ్యా-చుక్కపురివాస నే మ్రొక్కివేడెద నిన్ను గ్రక్కునను నా పతిని గాచి రక్షించు!

వ. సావిత్రి వరలక్ష్మిస్తోత్రము చేసె నెటువలెను.

లక్ష్మీస్తవం - కందార్థ దరువులు.

శ్రీకమలాలయనుగతీ, లోకత్రయవినుతచరిత లోకతివాసీ, రాకను ధాకరభగినీ, కాకోదరశయనుదేవ! దర్వు! కమలామాంపాహీ - నమో స్తుతే విమలాశుభదేహీ!శమితార్తజదోష కమనీయమృదుభాషా - మిత్ర మమశరాంబమదీయ జననీ శమదమాది గుణాఢ్యినుతహే - కమలా మాంపాహీ.

సత్యచరిత్రి త్రిజగసుందరి, ధృత కరకమలాబ్జనేత్రి పృథ్వీతనయా, సతతైశ్వర్యప్రదాయక, చతురానన దేవపూతా॥ దరు॥ జగతిలలామా-దిక్కింగామి నగజాతప్రేమ-విగతకల్మష దేహి వేదాంతగమ్యశ్రీ-భగవతే మహికరుణా మృగమురాట్మధ్యస్సరామి-జగతిలలామా.

శింపాలతాంగిసురుచిర, చంపకనమనాసంపూర్ణచంద్రవదననా, లంపాచితాంఘ్రి సకలము, సంపత్కర దేవినిన్ను॥దరు॥సన్నుతించెదనూకవి-జనకోటినిన్నుమెచ్చగనూ - క్రొన్ననవిలుకాని గన్నమాతరో జనము తిన్నగను మొర విన్నవించెద వెన్నుకి సతివంచు సన్నుతించెదనూ.

భవదీయచరణచింతన,పవలునురాత్రంబులందుపఠియించెదనీ,భువిజనులకన్న సంపద, లవిరళముగ నిచ్చి నేలు॥దరు॥మమ్మా క్రొమొక్కెదను-మమఘోరపాతకమూ - క్రుక్కగాను వోమ్మైన నా విన్నపము లాలకించి సమ్మతించియు నమ్మినానిల యమ్మనక మోదంబుతోన అమ్మా.

భూదేవపితామహ పురుహూతాది నిలింపులకు మహోత్సవమొసగక, భూతుల్ కృపచేసినగతి,మాతానాకొసగుమమ్మ॥ దరు॥మహదైశ్వర్యములు-దీనుల తనుజమహామాకార్యములు॥ యహిరాజ శయనూని మహిషి జలరుహనేత్రి-సహజముగ మద్గృహము నన్యగ్రహమదల్చియు దేహిమిత్తరి.

సత్పుణ్యచరితశ్రీవిల, సత్పదయుగళ సుందరాంగి జలధికుమారీ, హృత్ఫుల్ల పద్మనయనీ, జగత్పాపవినాశనీకు॥ దరు॥ కరుణించుమికను-మమదురితకరము దోపగను - ధరణి చుక్కాపురినరహరి సతినీదు చరణములహృత్సరసిజంబున స్థిరముగనునిడి మొరలుచేసితి- కరుణించుమికను.

వ. ఈరీతి మూడుదివసములు చేసిన నాలుగవనాడు.

ద్వి-గీ. బాలనుగుణాలవాలసుశీలనీవు,దుస్తరంబయిన వ్రతమును బూడగనేల, నీదుసత్యంబుజ్ఞానంబు నీదునడత, అన్ని మెచ్చితినమ్మనాకన్నులార. సా-గీ. మామగారు మీరు మదిచింతనేయుట, కేమివచ్చె నాకు యేర్పరించు, మీాడు నేనలోన మెదలియూ వ్రతమును, సకల సంపదలకై నేను సల్పితయ్య.

సంవాదం - ఆదితాళము.

ద్వి॥ బాలరో సుగుణాలవాల వినవమ్మ చాలగద వుపవాన మేలతగదమ్మ॥ సా॥ మామరో వినవయ్యమన్నించిమాట - కామితార్థము లెల్ల గలుగూనీవ్రతము॥ ద్వి॥ వుత్తామవ్రతమోనివుపవానముండి - చిత్తాము నొప్పించ చెల్లాదెతల్లి॥సా॥వో మామవుపవాసముండి సల్పుటకు- నేమించి చెప్పిరి నీతిపరులటూ॥ ద్వి॥ అయితేమంచిదికాని అతివరో నేడు - చతు

రాతతో పారాణ సేయుమిక నీవు। సా। నేడుసావిత్రికి నేమోమువిడుతు- వ్రతముక్రియలిడిచె దెట్లనుమామ। ద్యు।వుపవాసముంచుట కోర్చితివెట్లు- అపరిమితంబయిన అడవిలోనిట్లు। సా। నాకుయెక్కడిదయ్యఆకలిమామ- యేకాగ్రచిత్తనై యేనుండగాను। ద్యు। చిన్నాదానవు భక్తియెన్నావళి మానె- పన్నుగ నాపూర్వ ఫలమేపోయమ్మ। సా। మీాసేవకొరకయ్యి మేనత్తినాను-వావిగ చుక్కాపురి వానునిక్రుపచే।

ద్యు-గీ. మూడురాత్రులుపవాసమున్నదాన, వెంతతూద గొన్న దానవోయింతినీవు, ఆకటికి నోర్వజాల వివతిరయమున, బాలరత్నమా విను నేడు పారణయెనర్పు.

సా-గీ. మామగారు మీారు మన్నించుడిక నేడు, ప్రొద్దుగ్రుంకినాక పూజచేసి, కుడువతగును యిపుడు కుడుచుట తగదయ్య, వ్రతము నేయు టింత సతులకొప్పు.

వ. అని తనమనంబున చింతచేయుచున్నంత సత్యవ్రతుడు సమిధలకై అడవికింబోవ సమకట్టి తండ్రితో నేమనుచున్నాడు. స-క. ఓనాయన వినుడిక మీా, నేమన చేతబోయి మెప్పుగనడవుల్ మానక ఫలములు సమిధలు, భూనాథుడ తెచ్చెదాను పొమ్మనరయ్యా. ద్యు-క. సచ్చరిత నాదుపుత్రుడ, పచ్చనిపత్రములు దర్భఫలములు సమిధల్, హెచ్చరిక తోడదెమ్మినా, వశ్శాస భయభక్తిమదిని వదలక రమ్మీా.

వ. ఈరీతి పితసుతవాక్యంబులు విని సావిత్రి తనపురుషునికి నేడు మరణదినంబు గదా అడవికి నొంటిగపోనిచ్చుట తగదని అత్తతో నేమనుచున్నది. క. అత్తాదండము లిదుగో, చిత్తముతో నీకుసేవ చేతునుదాలా, యిత్తరి నామదిగనుమిక, అత్తామీాయాజ్ఞలోన అనువుగనుందుఱ్.

వ. అనిన యేమనుచున్నది.

సంవాదము - ఆదితాళము.

అ। ఏమికోరినావే మనసూలో యేమిదలచినావే - కోమలినీమది కోరిక దెల్పుమి భామరో సిగ్గును భయమెందుకేచెలి- యేసాధనముజూడ తలచికోరితి నీవాత్మలోదలచక వినయంబుతో సెలవిచ్చితోలించుమీా। అ। వనముజాచుటేమి నన్నువచ్చి యడుగుటేమి - మునులచేతది వనమందుండగ వాంఛనీకేటికి। సా। మునులాశ్రమములు చూచియుమనసుతో మ్రొక్కెదను మనకైశ్వర్యంబునుగల్గేటి దీవనగైకొని సేవచ్చెదయత్తరో। స - అ। సోపతెవరు నీకువున్నారు సుదతి మునులకడకు వోపతివ్రత ఒక్కటివైతివి చూపుదోరుకని చోటులుగలవటా। సా। నాకుసోపతిని వున్నారు మీాకుజెప్పితిని నీకొడుకిప్పుడు సెపముకొరకై ఆకులు పమి

దలశై పోతున్నాడు - మామనడుగపొమ్మి అమ్మరో మన్నించును సుమ్మి-భూమిచుక్కపురిధాముని కరుణచే కోపులి నీసుది కోరికదీర్చున॥ యే॥

వ. అనిన మామసన్నిధికిం బోయి యేమను చున్నది.

గీ. మామఓమామ వినవయ్య మహితలేశ, మనసునందున నాకకోర్కె దలచి తిపుడు, చాలదయచేసి బ్రోవుమీ సత్వరముగ, పాదముల కేను మ్రొక్కెద పాపరహిత. మా-గీ. ఇంతి బంగారు బొమ్మ వోబంతి నీకు, యేమికోరిక మదిలోన యిచ్ఛయించె, తెలియ జెప్పుమి వెన్నెల తేట యిపుడు, తీవ్రముగ నీదుకోర్కె నే దీర్తు నమ్మ.

సంవాదము - ఆదితాళము.

సా॥ మామ వోమామ వినుమ కోర్కె నేమాముతోడ వననీమనే జూచెద॥ మా॥ నేనేమి నేతు బాల నిన్నెట్లుదోలుదు చాన వుపవాసము న్నదానవే కోడలా-నే॥ సా॥ వనశృంగారంబు చూచి వచ్చి సావిత్రికి అను వుగ పూజ చేసి అపుడు నేకుడిచెదా॥ మా॥ ఎన్నడిటు లడుగ లేదు యిక యేమి నేతును చిన్నదానవు - అడవిచరి యింతు వేగతి-నే॥ సా॥ హితవుతో సమిధలకయి మీసుతుడు బోతున్నాడు అతని వెంటబడిబోయినే నడవి జూచెదను॥ మా॥ అతి వేగమె సమిదలకయి అడవినెల్లబోయి దిరుగును-అతివరో వానితోటి ఆయాసమెందుకు-నే॥ సా॥ పతి సేవలో దిరుగ పతివ్రతా ధర్మాము-పతినివిడి దినవెనుక ఫలమేమిమామరో॥ మా॥ వనజాక్షి నీదు మాటలను వినగా సత్యము - వనితరోచిన్నదానవు వనమెట్లు దిరిగేవు॥ మామ॥ నేనెన్నాడైన మందలించితిన నామీదకోర్కెదీర్చి నన్ను హోషించుమి॥ మా॥ నిను దోలనామనను నిలువదు తల్లిరో మునువు నే జేయు వుణ్యము కోడలవైతివే॥ సా॥ భూమిశ్రీ చుక్కపురి రాముని కరుణతో భూమెల్ల చూచివత్తు బుగులేల మామరో॥ మా॥

గీ. బాలత్రిరాత్రోపవాసంబు నున్నావు, అడవిదిరుగ లేవంటి వినవు, నీదుకోర్కె నాకు నిలుపవశంబానె, శీఘ్రముగ చూచి రావమ్మ చంద్రవదన. వ. ఈరీతి మామ సెలవివ్వగానే పతిపిరుందన జనుట కుద్యుక్తురాలై వరునితో నేమను చున్నది.

ఉ. మానవరాత్తనూజనను మన్ననచేసియు బ్రోవు మిప్పుడీ, కానన మెల్లనేడు పొడగాంచెదనంచు మనంబు గోరితిఁ, మానసమందు కించిదనుమానము లేకను కోరి ప్రేమచే, మానపతాక తేజ వన మేదిని జూవుమి

ప్రాణనాయకా. సత్య-చ. చెలియుపవాస ముండి వనసీమ చరించగలేవు సుందరీ, తిల భుజియించి మజ్జనకు దీవనలంది నిజాశ్రమంబునన్, నలరు చునుండుటొప్పుగని నాతోచరింపగ వత్తువనంటివయో, లలితలతాంగి నీ తలపులతక్షణ మానె వినంగ జెప్పుమా.

వ. ఈరీతి భార్యతో సంభాషించి తత్కోరికను యివ్వంజాలక తండ్రియనుమతి వడయువలెనని వచ్చి జనకునితో నేమనుచున్నాడు. రాజాధిరాజా రవికోటితేజా రాజితాకారా రణరంగశూరా జనక దండమర్పించెదన్. ద్వి-క. సమిధలుదర్భఫలంబులు, సుమములు కొని తెచ్చెదంచు పొరబోయిపుడున్, సమయంబువచ్చె కర్మకు, విమలాత్మక మళ్లి వచ్చు టేమాయెనురా.

సంవాదము - అటతాళము.

స॥ మనవిచేకొనుడిక నేజెప్పెదను మీకు తండ్రిగారు- నేటిదిన ముందునీకోడలుగోరె నొకమాటతండ్రి॥ ద్యు॥ యేమేమిగోరెను యెల్ల నాగనీతోటి నాదుపుత్ర-బుద్ధిశేమితలంచెను యేర్పరించుమీ నాకు॥ స॥ వనముచూడ వెంట వచ్చెద నని పల్కె- తండ్రి నేడు- వనితా నావెంబడి వద్దన్నవినదాయె-తం॥ ద్యు॥ కోరినట్టుగదయ్య మీరుచూపించుమి నాడు- చిన్నదానీ యింతకుముందు నన్నుబతిమాలెనునాదు॥ స॥ పడతినిదోలుక అడవెట్లుతిరుగుదు-తండ్రి-నాతో నడువచేతగాదు - నాతికుపవాసంబు - తండ్రి॥ ద్యు॥విరిబోణిమనను విరిగించగూడదు-నాడుదు స్త్వరముగ నడువక సావధానమునబొమ్మినాదు॥ స॥ నాకైతెతోచదు నాయన్ననీమనను తండ్రి-యెందాకునోర్వదునుమ్మి ధవళాబ్జలోచన-తం॥ ద్యు॥ వనజాక్షి కోరిన వనమెల్లా జూపించునాడు-నీకు దసరు చుక్కా.పురి థామాడు తోడయ్య-నాదు॥ వ॥ఈరీతి తండ్రి యాజ్ఞ యివ్వగానే నిజపత్నీసమేతుండై యడవికిం బోయి చిత్రంబులు చూపించె నెటువలెను.

స-సీ. చెలియరోనీమదిచింతలెల్లనుబాపిచూపెదవనభూమిచూడుమిదుగొ
మందారచంపక మాధవీసురపొన్న ఖర్జూరతిలతరుగణముజూడు
పరిపక్వఫలరసభక్షణచేసియు చెలరేగుచిలుకల పలుకువినుము
సకలజనులకుమది సంతసించగవిరులు వికసించియున్నట్టి విటపములును
కోమలంబులనాసించుకోవెలలునుఅదుగో కాసారములదిరుగు హంసల
వియ్యు, మేటిమృగములు దిరిగేటి చోటులివియ్యు,మునులఆశ్రమములు
జూడుమోదమలర. వ. ఇవ్విధంబుగ అనుపమంబైన వనమందు మృగపక్షితరుపుష్పంబులను పుణ్యనదులను సరసరసీరుహంబులను

యత్యాశ్రమంబులు మొదలైన చిత్రంబులు చూపించుచుండ సావిత్రి తనభర్తయైన సత్యవ్రతునకు నేడు మరణదినమని తలంచి యిటువంటి ప్రేమగల వరునకు యేమి కీడువచ్చునో యని మనస్సులో చింతించి భగవంతుని స్తుతిచేసి నెటువలెను.

దరువు - అటతాళము.

ఏమి సేతును వోదైవరాయా యేమిదోచ దురనీదుమాయా॥ ఏ॥ యిట్టిపురుషుడు యికదొరుకబోడు - నట్టులేకను యీవనముచూపెనేడు॥ నేడుయడవిలో యిటువంటిపతికి-కీడువచ్చునే మి కీడాయెమదికి॥ ఏ॥ కోరినట్టుగ వనమంతచూపె నారినీవనిమదిచింతబాపె॥ఏ॥యింతదయనన్ను జేసేవారెవరు-కాంతునితో సాటి ఘనులిక లేరు॥ ఏ॥ యెటుల చేతనుయిట్టివనమందు-కటకటా నాపూర్వకర్మ మేమందు॥ ఏ॥ వరుని యాదవ వారించి తేను ధరణిచుక్కాపురి హరినిగొల్చెదను॥ ఏ॥

గీ. చెలియరో వినవె నీమదిచింత యేమి, వనముజూచెదననివచ్చి వగవనేల, ఇంకనీమదిలో కోర్కెయేర్పరించు, శీఘ్రతరముగనిపుడునే జేయగలను.

సా-గీ. ప్రాణనాయక నాకేమిభ్రాంతి లేదు, కోరినట్టుగ చూపితిరికొదువ లేల, చెడికొరకయ్యు మీరింత శ్రమనుబడితి, రంచుమదిలోన దలచితి నంతె కాని.

సంవాదం - ఆదితాళము.

స॥ చెప్పరాదా నాతో చెలియరో సిగ్గుపడగనేల- వొప్పులకుప్పనీకప్పటిసమ్మతమివ్వదేదిచెపుమా॥ సా॥ నాకోసంబయ్యె శ్రమలు నీకుగల్గెనంచు-వ్యాకులపడితినిగాని వేరొక్క వ్యాజ్యమేమి లేదు॥ సా॥ అట్టిచింతగాదునాయానచెప్పవలెను-నట్టులేక నన్నడుగుము నీమదిగట్టుగనంతేల॥సా॥ ఆపలేమివచ్చెనాదు ప్రాణనాథవినుమా-భాసురాంగనాదు భ్రాంతిదీర్పగ మీసరియెవరయ్యా॥ స॥ చేతగాద చెపుమా యేమిసేతు నడవిలోన- నాతిమణిరో నాతోముందుగ నీతులబల్కితివి॥ సా॥ చింత చెందుటేమి మదిలో చెంచరిల్లుటేమి-సంతసమున చాయలుచూచితివి చేతగానిదేమి॥ స॥ నిలువుమిచటనీవు నేను ఫలమూలు దెచ్చెదను-లలనామణిరో నిన్నుచూచితె చలనమాయెమనసు॥ సా॥ వలదనుట యేమికను నీలోకలయుదిరిగెదాను-యిలచుక్కాపురి యీశునిపదములు తలచియున్న నేను॥

వ. ఈరీతి అన్యోన్యస్నేహంబున సరససంభాషణలచే వనమందు దిరుగుచున్నంతలో యమధర్మరాజు వచ్చె నెటువలెను.

యమధర్మరాజు రాకడ.

క. సనకునిశాపనిమిత్తంబున నరహరిరూపుదాల్చి పుడమిలో స్తంభం
బున వెళ్ళిరాక్షసుని జీరిన చక్కపురీశుగొల్తు రేయుం బవలున్.

దరువు - అటతాళము.



ధర్మరాజేతెంచెను లోకంబులో ధర్మముబహు మించెను- నిర్మల మైనట్టి నీలదేహమునందు భర్మభూషణముల పంక్తులుమెరయగ- కాల దండము మెరయగ పాశంబులు కదలి చేతులాడగా- శూలంబులునుబట్టి శూరులునడువగ- సాయముగ నెనుము వాహనమెక్కియు॥ ధర్మ॥ భండ నంబున శూరుడు భీకరమైన చండకిరణశూరుడు- గండుమీరినయట్టిపుం డరీకము లొప్పయుండు నేత్రంబునుజ్వరిల్లెడువాడు॥ ధర్మ॥ సత్యధర్మంబు లును నడిపించేటి సాహసవంతుడను - ప్రకటితంబుగ పుణ్యపాపంబు లేర్ప రచి సకలజీవుల నెల్ల సవరించెధీరుడు॥ ధర్మ॥ వరమార్తికంబులును గోమే ధిక వజ్రాలిసొమ్ములూను- స్థిరముగతనువూనమెఱసినటింపగ ధరచుక్కా పురిధాముడిదలచేటి॥ ధర్మ॥

ప్రధా-క. జనసమ్మతిమీరెవ్వరో,విలయుంబుగ తెరనువెళ్ళి వేంచే యుడుమీ,అనుపమరూపముచూచితె, మనసుకు సంతోషమాయె సుహి తచరిత్రా.

యమధర్మరాజు తెరవెళ్ళుట- దరువు- ఆదితాళము.

నేనేయమధర్మరాజును వినరా ద్వారక రాజధాని యమలోక మ నును వినరా - దీనులబ్రోచేటి దీర్ఘభుజుండను - మానకజనులను మద

మణగించేటినే-ధరలోన జనులాదెచ్చెదనురా - పాపంబులనెంచి నరకామందు వేసెదనురా - ఓరిమాతో వినునేకాలదండుడను వరలులాయకవాహనుడరా నేప్రళయకాలాగ్ని రూపుడనురా అతిభీకరరక్తకళలు ధరియించితినే - పటుతరమైన గదలతోనూ రోమంబు లెగయ భటులు వెంబాడి నడువాగను కుటిలాత్ములమది గుదియగొట్టుచును కఠినరంపముల ఖండించెదనునే - ధరణిశ్రీచుక్కాపురి నరహరినిప్రణతార్తిహరుని ప్రణమిల్లినిత్యము మరువాకపూజలు చేతువాని- వారిజమిత్రుని గూరిమిసుతుడను మారసుందరాకారుడనురా॥ నేనే॥

ప్ర-గీ. ఎవ్వరోరయ్యా బలవంత మిపుడునీదు, భీకరాకారమును చూచిబెదరితయ్యా, నీదుతలిదండ్రి రాజ్యంబు నీదుపేరు, తెలియజెప్పుట తగుభూప దివ్యరూప.

ధర్మరాజు - ద్విపద.

ద్వారకవినర దవ్వారికనీదు - కూరిమితోడ నీకుజెప్పెదను - పద్మిని నాతల్లి పద్మాయతాక్షి- పద్మమిత్రుడుతండ్రిపాపరహితుండు- యమధర్మరాజని యందురునన్ను- యమలోకమే లేటి యజమానినేర- చిత్రగుప్తులు నన్ను చేరికొలుతూరు- చిత్రంబుగను జనుల శిక్షించితెచ్చి- పుణ్యాత్ములనగొని పూజించి మరియు- పుణ్యంబులిచ్చేటి పురుషుండయేను- సకల ధర్మాధర్మసాక్షీభూతుండ- ప్రకటితంబుగ లోకప్రఖ్యాతుడాను - ఇపుడు జీవిని గొన యిటువచ్చితీర- వుపముతో గొనిపోదు వుర్విలోనుండి- చారుచుక్కాపురి స్వామినిదలచి- యారీతిలోకములు యేలెద నేను॥

దరువు - అటతాళము.

ధర్మరాజునువినర ద్వారకచాలధర్మమునడిపింతురా- ధర్మరాజును యేనుధర్మాంబరములతో కర్మసాక్షిసుతుడ నిర్మలాత్మకవిను॥ ధర్మ॥ కోరి యుద్ధమునందుచేరి భీకరముతో నారినాదముచేసి- మీరి బాణముదాల్చి శౌర్యముతోడ పోరిద్రుంచిన వెళ్ళిపారిపోదురు నన్ను మీరికవులంత॥ధ॥ చాలభీకరమైన కాలపాశములాను కేలధరించియు కోలాహలముగ ప్రాణులమర్దించి-విశాల మయిన కీర్తిలీలసాటించిన కాలుడరా నేను॥ ధ॥ మేరుధీరుడను బంగారుపన్నీట జల్తారు కొంగు శాలువజారు లోకములో నాపేరు దలచితె చారుచుక్కాపురి నరసింహుని గొల్తు॥ ధ॥

వ. ఈరీతి కాలుడు అరణ్యంబునకు వచ్చుతరి సత్యవ్రతుడు భార్యతో నేమను చున్నాడు.

గీ. ప్రాణనాయకివినగదవె భావములర, సమిధలును దెంపితెచ్చియు చనగవలయు, నిప్పుడునేపోయి తెచ్చెద నిలువుమిచట, ప్రొద్దుచాలాయెనే యిక పువ్వుబోణి.

సా.గీ. అత్తమామల నిద్దరనచటవుంచి,వచ్చినారమునిలువగవలదుమనకు,మంచిఫలములు సమిధలుగొంచురండి, వేగబోదాముజతగూడివిమలచరిత. వ. అనిన సత్యవ్రతుడు భార్యనచట నుంచి సమిధలకై పరవశంబు ధరియించిపోయి బలహీనుడై తెంపంజాలకమగుడివచ్చి గొడ్డలిభూమిపై వైచి వడవడవడంకుచు గద్గదస్వరుడై భార్యతో నేమను చున్నాడు.

సంవాదం-అటతాళము. సత్య బాలరో నాకేమి భయముతోచెనెమది - సన్నుతాంగి! నాకు వాలాయముగ నిల్వవశముగాదువిను- సన్నుతాంగి! సా॥ ప్రాణనాయకయింతభయమేమివచ్చెను-రాజవర్యా! నాదు-ప్రాణమునకుచాలబాధానిపించేను - రాజ॥ స॥ నిలవవశముగాదు నీతోడ నోచెలి - సన్ను॥నన్నుపలుకరించకునుమ్మి పరవశమాయెను-సన్ను॥ సా॥ అయ్యయ్యొయీమాటలాడకునాతోను-రాజ॥ నాకు చయ్యనమనసంతచాలదుఃఖంచేను- రాజ॥ స॥ తొందరబుట్టెనుతోచదేమిసేతు- స॥ మనసందు తలిదండ్రులమమతగల్గెనునాకు-స॥సా॥ అట్లయితె బోదము ఆలస్యమేటికి-రాజ॥ యిట్టి- గిట్లలోదిరిగేటి కారణమేమయ్యె- రాజ॥ సత్య! కన్నులు మందుతున్నావి తెలియదు- స॥ యిక-యెన్ని జెప్పినగాని యిచటపవళించెద-స॥సా॥ నిజముగ జెప్పుడు నేతాళజాలను-రాజ॥మది- గజబిజియాయెను గాళ్ళువడకసాగె- రాజ॥ స॥ యేమిచింతనీకు యిలచుక్కావురినున్న- స॥ మనకు- స్వామితోడున్నాడుసంశయమెందుకు - సన్నుతాంగి॥

వ. ఈరీతి నిలువశక్యముగాకయింద్రియక్షీణుడై వొకపాదంబుక్రింద భార్యతొడపై శిరంబునిడిపండుకున్నంత యముడు మనంబులోనేమనితలంచుచున్నాడు. గీ. పటుతరంబయిన యీదీర్ఘపాశములతో, పట్టి బంధించి సత్యవ్రతుప్రాణములను, కొంచబోవలె తేజంబునుంచిపైగ, త్వరితముగ నిపుడునానిజధామమునకు.

వ. అని సత్యవ్రతుని సమీపంబున నిలువంబడిన భీకరాకారునింజూచి సావిత్రి యేమను చున్నది.

## సంవాదం - ఆదితాళము.

సా॥ ఎవరయా మీరలు యెరుగజెప్పుమాటలు॥ యె॥ య॥ యమధర్మరాజును యెరుగవేనన్ను॥ యె॥ సా॥ ఏలవచ్చితి విందుచాలగయీవనమందు॥ యె॥ య॥ పరమపతివ్రత వౌట వెరచినిలచితిసీయెదుట॥ యె॥ సా॥ మునులెల్లజూచినారువింతలిట్టుపలికెవారు॥ యె॥ య॥ పరులకుగానరానుచిరుతనికై జూపినాను॥ యె॥ సా॥ యేమికారణమునీకుయీయడవికివచ్చుటకు॥ య॥ చెలినీదుభర్తజీవికిశ్రమచేగొనిపోదు దివి॥ యె॥ సా॥ భటులనుదాచుటేమితటుకుననీవువచ్చుటేమి॥ యె॥ య॥ పరమపుణ్యాత్ముడనియుపరులనంపకవచ్చినాను॥ యె॥ సా॥ యెవ్వరోనన్నిపుడు మీరుయెగ్గు సేయవచ్చినారు॥ యె॥ య॥ వాసిగశ్రీచుక్కాపురివానునిసాక్షిగనారి॥ యె॥ వ. అని తెలియజెప్పినవాడై యముడు యెటువలె జీవిని తీయుచున్నాడు.

మత్తకోకిల. దండమెత్తియు భీకరాకృతి దాల్చి జీవిని దీసియుఞ్, మెండుపాశముతోడ గట్టియు మీసముల్ వడ బెట్టుచుఞ్, గండుమీరిన కన్నులగ్గియు గ్రక్కుచుఞ్ జముడంతలో, నుండకఞ్ బలవంతుడై మది నుజ్వరిల్లుచు పోవగఞ్.

వ. ఇవ్విధంబున యముండు జీవిని తీసికొనిపోవ సమకట్టినంత సావిత్రి తనపతిశవము జూచి దుఃఖించె నెటువలెను.

## దరువు - అటతాళము.

పుడమిలోననువిడిచిపోతావా రాజా తడవుసేయక ననుదయసేయు రాజా-ననువిడుచుట నీకున్యాయముగాదెనినువిడిచివొంటరిగ నేనెట్లునిలుతు-అత్తమామలు నన్నడిగితేమందు చిత్తమునాకెట్లుచరియించునిందు-యెవరిపాలై పోదునికనిన్ను విడిచి సవరించు మిక నన్ను సామిదయజేసి-యింతకోపమునాపై నెందుకుసామిపంత మేలను యడవిపాలయితినుమ్మి-ధరణిచుక్కాపురిధామునిదలచినన్ను సరగునపోషించుసామిదయజేసి॥

గీ. అయ్యయో యేమి సేతు నీయడవిలోన, పతిని బాసియు నేనెట్లు బ్రతుకుదిలలో, పరులకాశించిబ్రతికిన బ్రతుకుకంటె, పురుషు డెటుబాయెనో వెంటబోదు నిపుడు. వ. అనితనతొడపై నిడినప్రియునిశిరంబు దిగువంబెట్టియు పత్రములచేత మరుగు గావించి యముని వెంబడి బోవగా.

యముడు-గీ. ఏమివెఱ్ఱి నీకు యిటు వచ్చుటా నీవు, తనువుతోడ రాను తగదు సుమ్మీ, హటముచేసి కేమి అవునమ్మ యడవిలో, భయము లేక వెంట పైనమేల.

డ్రికిపుడు యనరుచురాంగుల్, మెచ్చగసూర్గురుపుత్రులు, సచ్చరితులు గల్గగలరుజనువేగమునన్. ఈరీతి పొమ్మనగానే ప్రియుడు లేని వరమెందు కని మిగుడి పురుషుని సమీపమునకు వచ్చి నీరసేంధనమువగిది పడినవాని జూచి దుఃఖించె నెటువలెను.

దరువు - అటతాళము.

వద్దువద్దనియంటె వదలెట్టుబోదు పెద్దయడవిలోన పెనిమిటివిడిచి. వద్దువద్దని పుండరీకాక్షుడు పురుషూడు లేని బండదేహంబు వుండేమి సేయా॥ వద్దు॥ మగనిజంపినదాని జగతిలో నన్ను వగలాబెట్టుచు నరులు వంచింతురేమో॥వ॥ అతిగారవమున బెరిగి అడవిపాలైతి- పతి లేనిహీనాపు బ్రతుకాయె నాది॥ వద్దు॥ అయ్యయ్యొ నారాజఅతిదుఃఖపడితి - చయ్యనసీ వని సమర్థించు లేచి॥వ॥ కన్యప్రాయమునాకు కాంతూడునాకు- యెన్నరా నికష్టమేర్పాటు జేసె॥వద్దు॥ గ్రక్కున పురుషూడు గలిగి తేను-చుక్కాపురీ శుని సుదతిసిగొల్తు॥ వ. ఈరీతి విరహానల తప్తాంగియై నిలువంజాలక తన పురుషునిపై భ్రాంతి విడిచి పిదప కాలునివెనుక పోయియేమను చున్నది.

గీ. ఘోరయడవిలోన ఘోషలు పెట్టుచు, తోడు బాపుటేడ జూడ లేదు, ధర్మదేవతవయ్యుధైర్యంబుదప్పుట, వలదు దేవనాదు వరునివిడుము.

య-గీ. చాలదూరమొచ్చి సతికినదానవు, చేతగాదునడువ నాతి వినవె, దప్పిచేత కాళ్లు తడబడు చున్నవి, మళ్లిపొమ్మి నాదుమాట నమ్మి.

సంవాదం - ఆదితాళము.

సా॥ మతిమంతనాకుదప్పి మదిగుందుటేలను పతిచరణాసక్తమైన పతివ్రతలాకెల్లను॥ య॥ యింకానీకేమిబుద్ధి యిచ్చయున్నాది పంకజాక్షిరో నీదు పతినివిడిచి పోరుము॥ సా॥ మరియింకా వేరేచింత మగువలకెల్లాను పురుషూనిసంగాతికిని బుద్ధిగోరుచుండుమా॥ యెక్కడివురుషుడమ్మ యెక్కడిసంగతి దుఃఖపడకు యెంత దుర్బుద్ధిమ లేకొన్నరో॥ సా॥ తొందరజేసినన్ను దుఃఖింపజేయకు బంధువర్గములబ్రోవని ప్రభువులుండేటికి॥ య॥ యేమిసంబంధములు యిలజనులతోను కోమలివినవే యింత ప్రేమనీకేటికి॥ సా॥ ఆర్యులకెల్ల దాను లాత్మబంధువులును సూర్యజా నీకు నేను చుట్టమునైతిని॥ య॥ యింతజ్ఞానము నీకుయెక్కడగల్గెనే యింతి నీవాక్యములకు సంతోషమైతిని॥ సా॥ పతిభక్తిగలిగినా సతులాకు జ్ఞానము హితవుతో తానెగలుగు యెవరుజెప్పెదరు॥ య॥ నీకు ప్రసన్నుడనైతినీకిష్టంబైనదివో కీరవాణిరో నీవాక్కవరిమడుగుము॥ సా॥ పతివిరహంబుచేత బతిమాలుకొంటిని పతిసత్యవంతులబ్ధ జీవితునిగా జేయుమి॥ య॥ కోరినట్లుగనిత్తు కోదువాలంకేలను చారుశ్రీచుక్కాపుర స్వామిదయచేతను॥

యు-గీ. కొనుము నీదుపతిని కోమలి వీడును, నాల్గునూర్లవత్స రములు బ్రతికి, పుత్రులనూర్గుర పడసి భూతలమున, సాధుజనులకు ప్రియు డౌను సత్యముగను.

వ. మరియు వీడు చతుశ్శతాబ్దములు జీవించు శతలాభంబుగలుగు యజ్ఞయాగాదులవల్లదేవతలం దృప్తి జెందించుచు వంశభూషణుండై వర్ధిల్లునని చెప్పి యంతర్హితుం డయ్యె, పిదప సావిత్రి సంతోషముతో తొల్లింటివలె ప్రియునిశిరంబు తొడపై నిడుకొని యున్నంత సత్యవంతుడు నిదురించినవాని తెరంగున లేచి యేమనుచున్నాడు. క. ఇంతిరొ నిద్రబోయితిని, చెంతనుగా వుండి తెల్పి లేయగవలదే, యితపు ముందు గనిచటికి, పంతముతో వచ్చినట్టి బనియును జెపుమా. సా-గీ. నిద్ర జెందితి రీమాట నిజముగాదు, స్వప్నమునుపించె తోచదు సత్యవంత, చింత జెందుట మదిలోన చెల్లదయ్య, యెవరు మన వెనుక వచ్చెరు యడవిలోకి.

సంవాదం - ఆదితాళం.

స॥ కలగాదుయీమాటకలకంఠి నాకును తెలియగ జెప్పగదవె తీవరపడక॥ సా॥ రేపుజెప్పెదను నన్ను కాపాడుమిపుడు భూపాలతనయుండ భువికిచలగ॥ సా॥ మాటగాదునీకు ఆమనుజు డెవ్వడోయి మాయ లేల జెపుమి పోదు వేగ మెసామి॥ నిదురపోతిరేమి గురుతున్నదీ యేమని తెల్పుదు యీమాటమీకును॥ కల॥ యేమేమిజరిగె మాటలెక్కాడీమనుజుడు కోమలీ నాతో నీకుటిలాము తెల్పవె॥ సా॥ మీకోసమయ్యె చాల వ్యాకులపడితిని యీకాననంబునందు యేమిగురుతున్నది॥ స॥ నరగున జెప్పవైదె వచరణాములసాక్షిగ బరువయ్యె నా దేహంబుబలమింత లేకను॥ సా॥ యమధర్మరాజు యిప్పుడిటు వచ్చితమ ప్రాణములుదీసుకతల్లై వగచుత్వరితంబుగ॥ స॥ ఓసఖినిపుడే మిజేసితివె చెలి వాసిగ జెప్పుమిపుడు వనరుహలోచని॥ సా॥ వెన్నుదగిలి యు మామకన్నులు దెచ్చితి మన్ననతోను రాజ్యమంతయు దెచ్చితి॥ స॥ ఇంకేమాయె నచట బొంకక చెప్పుమి వంకజాక్షిరో నాతో భయమెందు కేచెలి॥ సా॥ జనకునిపుత్రశతలాభ మడిగితిని వినవయ్య నీదుప్రాణము దెచ్చినానిక-వరచుక్కాపురి వాసునికరుణచేత ప్రాణంబుల దక్కించినానిక॥ గీ. శిరమునొప్పిబాసె శీఘ్రమునాతల్లి, దండ్రిచెంత కిపుడు చేరవలయు,అడవిలోనవార లడలుచునుండియు, నేమిదలచినారొ నెలతవినవే. సా-గీ.రాజవినవయ్య మనమిపుడు రాత్రియందు, పోవవలవదు రేపటిప్రొద్దుగలుగ, పోదమిప్పుడుచూడగా ప్రొద్దులేదు, రాక్షసులు సంచరింతురు రాత్రివేళ. గీ. యెక్కడైనగాని యింతసేపుండను, ప్రొద్దుబోయె నెలత

పోవగలమొ, సంధ్యవేళ నన్ను జరుగనివ్వరయిటు, వొక్కరాత్రి విడిచి బ్రతుకగలరె.

సంవాదం - ఆదితాళము.

సా॥ అట్లయితె మనమతివేగంబున అందబోమికరమ్మి నాయందు కరుణచేలెమ్మి॥ స॥ వారజాక్షినీవలననుబ్రతికి వారక నెడనంటితల్లి తండ్రుల పొడగంటి॥ సా॥ నేనుచేసినపూజలు మంచివిగనుకనే బ్రతికినావు నామన సుకు దొరవైతివి॥ స॥ నీతిదప్పనినెలతవౌట నాఘాతలు మాన్పినావు నాధర్మపత్నివి నీవు॥ సా॥ మీకోసంబై మేనె త్తితి మీసేవలు మరచిమిమ్ము విడిచి గడియబ్రతికిన - కీరవాణి నీకోరికలెల్లను వారక తెల్పు నాతోను నీవాంఛలు దీర్చెదనేను॥ సా॥ వాసిగ చుక్కాపురీశునికృపచే మనమిల్లి పోదాము మనవారినెల్లా చూతాము॥

ఇవ్విధంబున సత్యవంతుండు గమనోన్ముఖుండై తలిదండ్రినిం దలంచి చింతించెనట యెటువలెను.

దర్వు - అటతాళము.

తలిదండ్రు లేమయిరో వోచెలి ననుదలచి యింకెటు బోయిరో కలికిరో నేనెందుకని యిందువస్తిత॥ అప్పుడే పోతుంటిని యీయడవిలో యాపదపాలైతిని యిప్పుడుబోకుంటె యికబ్రతుకలేను॥ త॥ కుటిలుడనై యుంటిగా నాతండ్రి కఠినుడై యుంటిగ తటుకునయెవ్వరైన దండించిరే మో॥ త॥ నేనెట్ల బ్రతికుందును నాతండ్రినిగానక యెటుబోయెనో మానిని నాతల్లి మదినొచ్చెనేమో॥ త॥ ఆకాననంబున నాతలిదండ్రి దక్కజీవిం చితేను చుక్కాపురీశుని మ్రొక్కి నుతింతు॥ త॥

ఈరీతిని దుఃఖించుచు మందగమనులై పోవుచుండగా నక్కడ ద్యుమత్సేనుండు లజ్జచేతస్కుండై సుతునిరాక కెదురు చూచు చుండ యేమని చింతించెను.

క. హాపుత్ర సత్యవంతుడ, నాపాలిటికొడుక నిన్ను నమ్మక నిచటన్
కాపాడుకొనక యుండితి, నేపాపిని నిన్నుదోల చింతించి తిటన్.

దర్వు - ఆదితాళం.

కొడుకురాడాయె నాకోడలెటుబోయె శిడవుచా ... యెనుయేదైవ తను కొల్తును యెన్నడైననువాడు యింతసేపుండడు కన్నతండ్రి చిన్ని కొడుకును కన్నుదెరువనిపాపడు॥ కొ॥ యెక్కడనిపోదును నేనెవ్వారి నడు గుదు వొక్కకొడుకునువిడిచి వోర్చెటులుందును॥ కొ॥ యేమినాకర్మము నేనెందుబోదు దైవమా యీయడవిలోను యిట్లు జేయ పాపమా॥ కొ॥ కన్నులువచ్చెను నాకన్నకొడు కెపుడువచ్చును - యెన్నరాని యడవిలోన

యింతకష్టమునొంది పాయక చెన్నుమీరగ మళ్లి జయము చేకొందాము ఆలాగె కానివ్వ మాలస్యమేలా చురా - రంపివాలా మనుగతము వాంఛ యొటులుండో - ధరచుక్కాపురి వరధామూని నమ్మిన మనల దయనుంచి పాలించు వాంఛలీడేరు॥

మత్తకోకిల. ఇవ్విధంబున తండ్రికొడుకు లనేకసంభ్రమలీలతో
దివ్యమయిన గజంబు నెక్కియు తేజరిల్లుచు నిజ్జనుల్
మదియతన నత్తగోడలు రమ్యముగ రథమున నెక్కియుఁ
నవ్యసుందర నృపుల గొనియాడి మ్రొక్కియు నిప్పుడుఁ.

క. విశ్వమంతాదినీశ్వరుడై, సకలజనులు బొగడ చిత్రాశ్వనకును
యువరాజ్యము శాశ్వతముగ, గట్టి కిరీటాము మంగళారతీయ.

సావిత్రీపరిణయము - యక్షగానము

సంపూర్ణము.



రొక్కడచూతును॥ కో॥ గడియాల్లో కొడుకును నాకండ్లాలో జూచితే నిపుడు - చుక్కపురిహరికి ముడుపులు నేయిత్తును॥ కో॥

ఇవ్విధంబున చింతజేయు చుండగ సత్యవంతుడు పత్నీసమేతుండై వచ్చిన కని యెదురు చని గాఢాలింగనంబుజేసి సంతోషాబ్ధినిం దేలి తనయునితో నేమను చున్నాడు.

ఉ. భానుగుణాకరార్కనిభ హస్తత రత్నమా సత్యవంతనా, కీసమయంబున మనసు కెప్పటితీరుగ సమ్మతాయె నీ, భాసుర మోమునందు కళవాడినతీరుగ నున్నదిప్పుడున్, వేసటజెందుటేమి వనవాసులు మిమ్ముల యేమి జేసిరో.

అని యడిగిన తండ్రితో కుమారుడున్ను అత్తతో కోడలున్ను వోర్చి రెటువలె. సం - ద్యు. కొడకా నాకొడకా నాకడుపు నిండెను మళ్లి నీవు వచ్చినావు.

సం॥ నాయనా నీయొక్క యాశీర్వచనములతో నేను బ్రతికినాను॥
భ॥ ఇంతాపని మీకు యెవ్వరుజేసిరే బాల జెప్పవేల॥
సా॥ నీతోడుఅత్తరో నిజముగా నీముద్దుకొడుకును అడుగు తెలునునూ॥
ద్యు॥ కుటిలామెందుకురా నాకొడకా నీకింతేమి కష్టమువచ్చె నష్టమూ॥
స॥ నిద్రబోయితి నేను నీముద్దుకోడాలి నడుగూడి చెప్పమా నుడీ॥
భ॥ ఏమేమి జరిగెను యెందుకు జెప్పవే నాతో మోదమూతో॥
సా॥ ఈవేళదినమందు యితనిప్రాణము బోవునాని చెప్పె మౌని॥
ద్యు॥ ఇకయేమిచేతు నాయన నీవేళ దైవముదెచ్చె నైల్యాము॥
స॥ ఇంక వినుండీ నాయింతిసేయగ నేనూ బ్రతికతీ మిమ్ము గలసితీ॥
భ॥ నాతల్లి నీముద్దునాథుని కేమేమి నీవుజేసినావు॥ సా॥ చచ్చేదినం బోసి చయ్యాన నేవెంటబోతి ముందుగాను॥ ద్యు॥ మరియింక యేమాయె మాయమ్మ తెల్పు నాతో చింతనూ॥ స॥ ఏమిదోచదునాకు యెవ్వాడో కాని నిందువచ్చె మోసపుచ్చె॥ భ॥ వచ్చినట్టి పురుషు డెవ్వారో చెప్పవమ్మ ముద్దుగుమ్మ॥ సా॥ చేతగాదనితాను చెట్టుక్రిందను నిదోవచ్చే యముడువచ్చె॥ ద్యు॥ అయ్యయ్యొనాతండ్రి ఆయాసపడ్డావజాల అడవిలోన॥ స॥ చెప్పవశముగాదు చెలి నన్ను పోషించినాది తెచ్చినాది ప్రాణములు బెకలించి పట్టుక వేగను సల్పినాను॥ ద్యు॥ ధరణి చుక్కాపురిధాముడు గతి మాకాయె సమ్మతాయె॥

వ. అనిన సావిత్రి యేమను చున్నది.

మామగారు వినుడి మరియొక ముచ్చట నాలుగువరము లడిగినాను యమునితో నేను కనుదోయి రాజ్యము-తండ్రికిపుడుపుత్రశతలాభమును

నాదుపురుషు జీవమున్వాగో-జయముండ్నికో వినవే నాజన్మఫలంబులన్ని నాశనమాయె నేజేసినఫలము జన్మమునందు నినుజూచుటగలిగెగా ఇక సత్యవంతునికొరకు నేనాసతో మేనత్తినాను దయూరసథా త్రికా- యేసత్య జనులకబ్బెని-మీరాసేవజేయగలిగెను మేదినిమీరదగా।

వ. అని సంతోషిత పులకాంకిత శరీరుండై బిగ్గర కౌగలించుకొని అశ్వపతిరాజు వస్తుసించి వచ్చి నేమను చున్నాడు.

సంవాదం - ఆదితాళం.

ద్యు॥ వింటివా యీవెలదిమాటలు చంటిపిల్లా దీని సరసజ్ఞానము॥ ప్ర॥ సుందరి యీసుదతి వెనుకముందు చేయుపుణ్యమున దొరికె మీకు॥ భ॥ సార్వభౌమ సఖియుమంచిది పూర్వమందున నిది పూజమంచిది భామరో నీభాగ్యమేమందు కోమలి నిక సుజనులు కొనియాడ నన్ను మెచ్చ న్యాయముగాదు పన్నుగా మీసేవచేసి నేనుండ॥ ద్యు॥ కలికి నీవలన నా కన్నులువచ్చె లలిత మాయింటికి లక్ష్మియై వచ్చె॥ ప్ర॥ నేను జేయగా యీకన్య జిక్కెను మీకుమరియీదద క్కెను॥ భ॥ కొడకావినుమింకకొడు వేమి లేదు మానవతి యీజగతిలోపల దొరికె యింతిరో నీవెంతపుణ్యవతివె సంతసించిరి యీజగతిలోన లేరు॥ సా॥ చక్కాపురీశుడు నిన్ను మెచ్చెదరు యింత మేలు యేమిజేసెదరు॥ ద్యు॥ కరుణతోడుత వరుడు నీకెపుడూ వరమిచ్చు॥ రా॥

ఇవ్విధంబున సంతోషమగ్నులై యున్నంత అశ్వపతిప్రతినిధులలో నొక్క రరుదెంచిన సంతోషపడి మద్రదేశంబునుగూర్చి పోయిన తదుపరి యిక్కడ మాళవదేశమందలి సత్యపురి పట్టణవాసు లయినసామంత ప్రధానిసమితులున్ తదితరజనంబులు వచ్చి ద్యుమత్సేనునితో నేమను చున్నారు.

రాజేంద్ర సాళ్వభూవరాట్సురేంద్ర ఇవ్విధంబునం గొనియాడి ద్యుమత్సేనుండు సంతసించి కుమారకేశ్వరునితో నేమను చున్నాడు.

ద్యు॥ చిన్నతనయ సంతసిల్లి తిటురందు మీరు తడవుసేయకబోవలె నగరము మోదమున నిప్పుడె పూని శత్రులచేత బుధులమైతిమీ॥ రా॥ మనధాత్రి యెక్కడగాని తెలుపుమిపుడూ॥ దు॥ శత్రు లెల్లా మృతిజెందినారట వినుమీ మనధాత్రి కేగుదమిపుడూ మరివినుతనయా- యజమానులు మీకు యెట్లుజేసినాగాని సమ్మతాయెనా - యిన్నిదినంబులు